వేంకటనరసింహాచార్యులు, ఉత్పల కౌశిక

భోజకాళిదాసకథలు

చెన్నపురి, 1924

Vēṅkaṭanarasiṃhācāryulu, Utpala Kauśika

Bhōjakāḷidāsakathalu

Cennapuri, 1924

Record no. 662

**SUNDARAYYA VIGNANA KENDRAM**
1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

## Bibliographic Record Target

వేంకటనరసింహాచార్యులు, ఉత్పల కౌశిక.

భోజకాళిదాసకథలు / శ్రీమాన్ ఉత్పల వేంకటనరసింహాచార్య విరచితము.- చెన్నపురి : వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, 1924.

(1), 153, 3 p. ;19 cm.

Record no. 662

Vēṅkaṭanarasiṃhācāryulu, Utpala Kauśika.

Bhōjakāḷidāsakathalu / Śrīmān Utpala Vēṅkaṭanarasiṃhācārya viracitamu.- Cennapuri : Vāviḷla Rāmasvāmiśāstrulu aṃḍ Sans, 1924.

(1), 153, 3 p. ;19 cm.

Record no. 662

శ్రీరస్తు.

# భోజకాళిదాసకథలు.

## ప్రథమభాగము.

శ్రీమాన్ ఉత్పల. వేంకటనరసింహాచార్య

విరచితము.






చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

1924.

PRINTED
AT THE 'VAVILLA' PRESS
MADRAS.–1924.

# విషయసూచిక.

# భోజకాళిదాసకథలు.



## 1.

## భోజరాజు.

శ్రీమన్మహారాజ విక్రమాదిత్య పరమారచక్రవర్తివంశమున జనించినసింధులుఁ డనురాజు ధారా (ఉజ్జయిని) పురము రాజధానిగ విదర్భదేశమును బాలించుచుండెను. ఇతఁడు మిక్కిలి బలపరాక్రమముల ననేకశత్రురాజుల నోడించికప్పములం గొనుచుఁ బ్రజలపై ననురాగమును బ్రాహ్మణులయందు విశ్వాసమును దేవతలయందు భక్తియుఁ గలిగి పెక్కుసంవత్సరములు ధర్మమార్గమును దప్పక రాజ్యాధికారమును జెల్లించుచుండెను. గృహమున సకలభోగభాగ్యములు సంపూర్ణములై యునికిం జేసి వానింగుఱించి యేలాటిచింతయు లేకున్నను వార్ధకము సమీపించియున్నను సంతానము గలుగమికిఁ బలువిధముల రాత్రియుం బవలు పరితాప మొందుచుండును. లోకములో బాల్యమునుండి కుమారు లొనర్చుముద్దుచేష్టలఁ గనుంగొనుచు నానందము నొందుసంతానవంతు లగుమాతాపితల భాగ్యము నుగ్గడించుచు జన్మాంతరమున నంతటిపుణ్యమును జేసికొనకపోయితిఁ గాబోలు నని తనబ్రదుకును దూషించుకొనుచుండును. "అపుత్రస్యగతిర్నాస్తి" "పుత్రులు లేనివాని కేదియు

"గతి లేదు" అనునిట్టి పెద్దలవాక్యముల వినునప్పు డెల్ల నిహలోకా
నందమున కే కాక పరలోకానందమునకును దూరగతుఁడ నైతిఁ
గదాయనితహతహపడుచుండును. ఎన్నివిధములఁబరితపించినను
దైవ మనుకూలింప కున్న నెట్టివాఁ డైన నేమిచేయఁగలఁడు?

ఈలాగున సింధులుఁడు పుత్త్రులు లేనికలవరమున
నేమియుఁ దోఁచక పాపశాంతికొఱకు గోదానభూదానహిరణ్య
దానాది మహాదానముల బ్రాహ్మణోత్తముల కొసంగెను.
శ్రీరంగాదిదివ్యదేశముల నెల్ల సేవించెను. కావేరి మున్నగు
పుణ్యనదీతీర్థములఁ దానమాడెను.

ఇట్లు కొన్నిదినములు గడువ నేపుణ్యపరిపాకముననో
సింధులునిభార్య సావిత్త్రి గర్భవతి యయ్యెను. ఇఁక సింధు
లునిసంతోష మే మని చెప్పఁగలము? దైవానుకూల్యంబున
నింతకాలమునకు సంతానప్రాప్తి గలుగంగలిగెఁగదా యని లో
లోన నుబ్బిపోవుచుండెను. ఇట్లుండ సావిత్త్రికిఁ దొమ్మిదిమాస
ములునిండెను. శుభదివసమున మంగళముహూర్తమునఁజంద్రుఁ
డువోలె నెంతయుఁ దేజరిల్లుసుకుమారుసుకుమారుంగనియెను.
అట్టిమనోహరమగుకుమారరత్నము జనించినసంగతి విని సింధు
లుఁడు పరమానందసింధువులో మునింగిపోయెను. యౌవనకాల
మునం బుట్టినపుత్త్రులకు సైతము మాతాపితలు పట్టరాని సంతో
షమునందుటలోకసహజము. ఇఁకముసలితనమునఁ బుట్టకపుట్టిన
సంతానముగుఱించిసావిత్త్రీసింధులులసంతోష మిట్టిదనివరింప
నెవ్వరితరము ? ఆజన్మోత్సవదినమున బ్రాహ్మణబృందముతో
డను మిత్త్రామాత్యబంధువర్గములతోడను గూడుకొని పరమా



నందమున యథావిధిగ జాతకర్మాదుల జరిగించి తరువాత రాశిని
బట్టి భకారము మొదలనుండునట్లు భోజుఁ డని నామకరణముఁ
జేసెను. ఇట్లు క్రమక్రమముగ శుక్లపక్షచంద్రుఁడువోలె నభి
వృద్ధి నొందుచుండుబాలకుని సావిత్త్రీసింధులులల్లారుముద్దుగాఁ
బెంచుకొనుచుండిరి. చిరకాలమునకుఁ గలుగక కలిగినసంతాన
మగుటంజేసి యితరకార్యములను వదలి యెల్లప్పుడుఁ బుత్త్రుని
ముద్దులాటలవలననే సావిత్త్రీసింధులులు కృతార్థులగుచుండిరి.
భోజుఁడు దినదినప్రవర్ధమానుఁడై సూర్యునింబోలెఁ దేజరిల్లు
చుండెను. వానిమనోహరరూపమును దేజమునుగనుఁగొన భావి
కాలమున నతఁ డొనరింపఁబోవుమహాకార్యముల సూచించు
చుండెను. తెలిసియుఁ దెలియనిముద్దుముద్దు చేష్టలును వచ్చియు
రానిముద్దుముద్దుపలుకులును తలిదండ్రులనే కాక యెల్లవారిని
రంజింపఁ జేయుచుండెను. భోజుఁడయిదేండ్లబాలుఁ డయ్యెను.
సింధులుఁడు దాను వృద్ధుఁ డగుటవలన నవసానకాలము సమీ
పించి యుండుటయును, భోజుఁడు కార్యాకార్యములం దెలియం
జాలనిబాల్యదశయం దుండుటయుఁ గనుగొని భోజునిపురోవృ
ద్ధినిగుఱించిమాత్ర మొక్కొక్కసమయమున విచారము
నొందుచుండును, ప్రతిమనుజుఁడు వానివానియదృష్టప్రకారము
సుఖదుఃఖముల నొందుచుండు నని యెఱింగినవాఁడయ్యుఁ
బ్రేమానుబంధవశమున మనస్సు నిలుపఁజాలక యొకనాఁడు
జ్యోతిష్కునిఁ బిలిపించి భోజునిజాతకమును జూపెను. అతఁడు
జన్మకాలగ్రహసంపత్తిని జూచి యాయాభావములనిర్ణయించి
యిట్లనియెను. "రాజా! ఈజాతకుఁడుదీర్ఘాయుష్మంతుఁడు; ప్రతా
పము, ధైర్యము, శౌర్యము, పాండిత్యము మున్నగుననేకసుగు

ణములు గలిగి పెక్కువర్షములు రాజ్యమును బాలింపఁగలఁడు. ఇతనిపాలనమునఁబ్రజలలో నొక్కఁడేనియు మూర్ఖుఁడు గాని దుర్భాగ్యుఁడు గాని యుండ నేరఁడు. ఎల్లరు విద్యావంతులుగను ధనవంతులుగ నుందురు. బాల్యముననుమాత్ర మొకగండము గలదు; గానియయ్యదియొకపుణ్యాత్మునివలనఁదప్పిపోవంగలదు. సుఖదుఃఖములు కర్మానుసారముగఁ గలుగుచుండును. వానిం గుఱించి మూఢుఁడు మాటిమాటికిఁ జింతిల్లుచుండును; గాని విద్వాంసుఁడు మనమున వికారము నొందక సుఖదుఃఖముల నొక్కరీతిగనే మెలంగుచుండును. కాఁబట్టి దీనికై చింతిల్లిన లాభ మేమి గలదు?” అనియిట్లు జ్యోతిషికుఁడు పలుక విని ధైర్యము వహించి వస్త్రభూషణాదులచే నతని సత్కరించి వీడ్కొలిపెను.

తరువాత సింధులుఁడు భోజుని రూపలావణ్యాదులఁ గనుంగొనుచు మహాసంతోష సముద్రములో మునింగి పోయెను. ఐనను వృద్ధుఁడగుటవలన మనస్సు పరిపక్వమై సంసారమునుండి విరక్తుఁడు గాఁ దలంచెను. రాజ్యభారమును వహించి ప్రజాపాలనమును ధర్మముఁ దప్పక నెఱవేర్పఁగలవా రెవ రనువిచారము హృదయమును బాధింపఁజొచ్చెను. ఇతనికి సమర్థుఁడును మహావీరుఁడు నగుముంజుఁ డనునొకతమ్ముఁడు గలఁడు. ఇతనికి రాజ్యము నొప్పగింపఁదలంచెను. గాని యతని ప్రవర్తన ముచితము గామి నట్లుచేయ మనసురాకపోయెను.

ఒకనాఁడు బుద్ధిసాగరుఁడు మున్నగుముఖ్యామాత్యులఁ బిలిపించి యేకాంతముగ నిట్లాలోచించెను. “మంత్రులారా!



మాపూర్వు లెందఱో నీతిమార్గమును వదలక ప్రజలపై దయ గలిగి మానధను లై రాజ్యముం బాలించి కీర్తిశేషు లైన వృత్తాంతము మీ రెల్ల రెఱింగినదియే. నేనును మీసహాయమున శక్తికొలఁది పూర్వులమార్గము ననుసరించియే యింతవఱకు ధర్మమున కవకాశ మీయక ప్రజలఁ గాపాడి నాఁడ. ప్రకృతము కేవలము వార్ధకదశ సంప్రాప్తించుట వలన నీరాజ్యభారమును భరింపఁజాలకున్నాఁడను. భోజుఁడు మంచిచెడ్డలఁ గుఱు తెఱుఁగనిపసిబాలుఁడు. కొంతకాల మితరుల వశములో నుంచుకొని యన్నివిషయముల యందును వృద్ధికిఁ దేఁదగినవాఁడు. నా తమ్ముఁ డన్ననో మహాబలశాలి. క్రూరస్వభావమున నెంతటిదుష్కార్యమున కేనియు వెఱవఁడు. రాజ్య మెప్పుడు నాకు లభించునా యని రంధ్రాన్వేషణము సేయుచు సమయమునుగాచియున్నాఁడు. ఇతనికి రాజ్యమీయక భోజునిఁ బట్టాభిషిక్తునిఁ జేసినం బ్రజలెల్లరు “సింధులుఁడు ద్రోహబుద్ధిచేఁ దమ్మునికిఁ బట్టాభిషేకము సేయక పుత్త్రప్రేమచే బాలుఁడైనను భోజునకే రాజ్యము నిచ్చెను” అని తద్దయు దూషింతురు. దూషించినం దూషింతురుగాక యని యట్లే చేసినను ముంజుఁడు రాజ్యాభిలాషి గావున విషముఁ బెట్టియో నదిం ద్రోయించియో తల నఱికించియో యేలాగున నైనను భోజుని జంపక మానఁడు. అప్పుడు నీరాజ్యము నొసంగుటయే వ్యర్థముకాక పుత్త్రహానియు దానం జేసి వంశనాశమును గలుగును. రాజ్యముపై నాశ యతని నెంతకార్యము నేనియుఁ జేయింపకపోవునా? ఆశయే కదా పాపమున కాదికారణము. క్రోధము, ద్వేషము నాయాశవలననే కలుగుచున్నవి. ఆశవలనఁ

గోపము, కోపమువలన దుర్బుద్ధియు, దుర్బుద్ధిచే నెట్టి విద్వాం
సుఁడును నరకమును బొందకమానఁడు. ఆశ గలవాఁడు తల్లి
నేనియుఁ దండ్రి నేనియు గురువు నేనియుఁ గుమారు నేనియు
మిత్త్రు నేనియుఁ బ్రభువు నేనియుఁ దోడబుట్టువు నేనియుఁ గని
కరము లేక చంపుటకు వెనుదీయఁడు. కావున నిపుడు ముంజునకే
రాజ్యభారము నొసంగుట యుక్తముగాఁ దోఁచుచున్నది.
ఇట్లొనర్చిన భోజుఁడు సజీవుఁడై ముంజుని యనంతరమేనియు
రాజ్యమునొంది సుఖింపఁగలఁడు"

అని సకారణంబుగఁ బలికిన సింధులుని పలుకులకు మంత్రు
లెల్ల రనుమతించిరి. తరువాత సింధులుఁడు ముంజునిఁ బిలి
పించి గారవమున దగ్గఱ దీసి "తమ్ముఁడా! నేను వృద్ధుఁడ నైతిని.
ఈరాజ్యభారమును భరింపఁజాలక యున్నాను రాజ్య తంత్ర
ములయందు నీవు మిక్కిలి నేర్పరివి. కావున రాజ్యాధికారము
నంతయు నీకే యొప్పగించుచున్నాఁడను భోజుఁ డేమియు నెఱుఁ
గని పసిబాలుఁడు. వీనిం బుత్త్రునిగ నెంచి పెంచి పెద్దవానిఁగఁ
జేయుభారము నీదై యున్నది." అని కొన్ని నీతివాక్యముల నుప
దేశించి పట్టాభిషిక్తునిఁ జేసెను. తరువాత సింధులుఁడు శాంత
చిత్తుఁడై యాత్మజ్ఞానము గలిగి భగవంతుని ధ్యానించుచు
నచిరకాలముననే పరలోకగతుఁ డయ్యెను. రాజపురమున నం
తఃపుర మంతయు రోదనధ్వనులచే నిండిపోయెను. ప్రజ లెల్లరు
దుఃఖసముద్రములో మునిఁగి వాపోవుచుండిరి. ముంజుఁడును
దుఃఖితుఁడై భోజుని ముందుంచుకొని దహనసంచయనాది
కర్మల నెల్ల సక్రమముగ నెఱవేర్చి యనంతరము పరమానంద



భరితుఁడై సింహాసన మధిష్ఠించెను. ముఖ్యాధికారము లభిం
చినదాదిగ మదోన్మత్తుఁడై ప్రధానమంత్రులఁ గొందఱిని నిష్కా
రణముగ మంత్రిపదవినుండితొలఁగించి యాస్థానమునఁ దనకిష్టు
లగు నితరుల నియమించెను. ముంజుఁడు చిన్ననాఁటనుండియు
లోభియుఁ గ్రూరుఁడును స్వార్థపరుఁడు నగుటం జేసి తనయిష్టము
ననుసరించి ప్రజల మే లెఱుంగక యే రాజ్యమును బాలించు
చుండెను. తొల్లిటిరాజ్యనిబంధన లన్నియు మార్చి క్రొత్త
క్రొత్తనిబంధనల నేర్పఱచెను. ప్రజల కియ్యది తొలుదొలుతఁ
గష్టముగాఁ దోఁచినను గ్రమముగా నదియు సాత్మ్యస్థితికి
వచ్చెను. ఇట్లు కొన్నిదినములు గడువ భోజుఁ డెనిమిదేండ్లవాఁ
డయ్యెను. సంస్కృతవిద్యాభ్యాసమునకుం దగినకాల మని
తలఁచి ముంజుఁడు భోజునకుఁ గా నొక సంస్కృత పాఠశాల
స్థాపించి యం దనేకశాస్త్రముల నాఱితేఱిన పండితుల నుపా
ధ్యాయులుగ నియమించి యుక్తకాలమున యథావిధిగ నుప
నయనం బాచరించి విద్యాభ్యాసము సేయఁ బాఠశాలలో
నుంచెను. భోజుఁడు మిగుల బుద్ధిశాలి గావున నుపాధ్యాయుఁ
డొకసారి చెప్పినమాత్రన నిరాయాసముగఁ బాఠము గ్రహిం
చుచుండెను. వీని బుద్ధిచాతుర్యము, ధారణాశక్తియు, విధేయ
తయు, శ్రద్ధయు, సన్మార్గప్రవర్తనమును జూచి యుపాధ్యాయు
లెల్లరుఁ బ్రేమతో విద్యల నెల్లఁ గఱపుచుండిరి. ఇట్లు స్వల్ప
కాలముననే స్వాధ్యాయమునందును, సాహిత్యమునందును,
దర్క వ్యాకరణాది శాస్త్రములయందును, వైద్యశాస్త్రము
నందును, నలంకారశాస్త్రమునందును, శరీరవ్యాయామక్రీడల

యందును, మిక్కిలి నైపుణ్యము గలిగి పురుషరూపమున భూలోకమున నవతరించిన సరస్వతియో యన సకలవిద్యలలో భోజుఁడు నేర్పరి యయ్యెను. అప్పటికిఁ బదుమూఁడుఁ బదునాలుగేండ్ల వయసువాఁ డయ్యెను.

ఒకనాఁడు ముంజుఁడు భోజునివిద్యాకౌశలమును బరీక్షింప నెంచి పాఠశాల కేఁగి గారవమునఁ బిలిచి పండితుల ముందఱ శాస్త్రవిషయ మొకదానిఁ బ్రశ్నించెను. భోజుఁ డావిషయమును శరపరంపరలుగ ననేకరీతుల నాప్రశ్నమునకు సమాధానముఁ జెప్పి విద్యాగురువుల మనముల సంతోషపఱిచెను. ముంజుఁ డతఁడు వచించుసమాధానవాక్యముల కర్థమే యెఱుంగ లేక పోయెను. తరువాత ముంజుఁడు గృహమున కేతెంచి భోజునిబుద్ధిచాతుర్యమున కచ్చెరువందుచు నేకాంతముగ నిట్లాలోచించెను. "భోజుఁ డింత చిన్నప్రాయముననే యిన్నివిద్యల సులభముగ గ్రహించెను. బాల్యమున నింతటి తెలివి తేటలు గలుగువాఁడు ప్రౌఢవయస్సున నెంతటివాఁడు కాక పోఁడు? ఇట్టి బుద్ధిశాలి నన్నేలాగున నైన మోసము చేసి రాజ్యముమాత్ర మపహరింపకుండునా? నాధనము భోగభాగ్యము లన్నియు వీనిపాలు గాకపోవునా? సర్వసంపదలు భోజునియధీనము లైనపిదప నామొగముఁ జూచి నన్నాదరించువా రెవ రుందురు? ధనమున్నంతదనుకనే కదా యెట్టియల్పుం డేనియు నొకప్రముఖుఁడుగఁ దోఁచును. పేరును, బుద్ధియు, నింద్రియములును, మాటలుఁ దొల్లిటి వయ్యును ధన మొకఁడుమాత్రము లేకున్నఁ బురుషుఁడు మఱియొకపురుషుఁడుగ మాఱుచున్నాఁడుగదా. కావున నెల్లకాలము



నిరాటంకముగ రాజ్యము ననుభవించు నుపాయము నాలోచింపవలయును. శరీరముపై నాశ వదలి నేర్పరియై ప్రయత్నపూర్వకముగఁ గార్యములఁ జేయువానికసాధ్య మేది గలదు? అతిదాక్షిణ్యమును, మాటిమాటికి సందేహమును, పగులు నిందింతు రనుభయమును గలవాఁ డెన్నండును సంపదలఁ బొందనేరఁడు. ఐశ్వర్యము నొందఁ దలఁచిన మిగుల జాగరూకతతో నీఁదగినవారి కిచ్చుటయుఁ బుచ్చుకొనఁదగినవారివలనఁ బుచ్చుకొనుటయు నేపని నెంతవేగముగఁ జేయఁదగునో యట్లాయాకాలమునకు సరిగ నాపని నెఱవేర్చుటయు ముఖ్యముగ గమనింపవలయును. కాదేని కాలదోషముచేఁ గార్యములన్నియు విపరీతము లగును. పౌరుషము గలవాఁ డేకార్యమునందును అగౌరవమునే ముందుంచుకొని గౌరవము వెనుకఁ బెట్టుకొని తనకార్యమును సాధించుకొనవలయును. జాగరూకత వదలి కార్యముఁ జెఱుచుకొనుటకన్న మాఢ్య మేది గలదు? బుద్ధిమంతుఁడు కొంచెమునకై మిక్కిలి పోగొట్టుకొనక యాకొంచెమువలననే యధికమును సంపాదించును. ఇది యట్లుండఁ గార్యకౌశలము గలపురుషుఁడు శత్రువునేనియు రోగము నేనియుఁ బుట్టఁగనే నశింపఁ జేయవలయును. ఊరకుండునేని యాశత్రు రోగము లెట్టిబలవంతు నైనను బ్రాణాంతమువఱకు బాధింపకమానవు. ప్రకృతము భోజుఁడు ప్రబల శత్రువుగాఁ దగియున్నాఁడు. ఉన్నతదశకు రాకమును పేవీని నణఁగఁద్రొక్కుటమంత్రజ్ఞునకుఁ గర్తవ్యము. విషవృక్షమును శత్రువును నంకురదశయందే ఛేదింపవలయునని పెద్దలు చెప్పుదురు గదా. కావున నిప్పుడు భోజుని

బరిమార్చు ప్రయత్నముఁ జేయవలయు" నని యాలోచించి
యేమియుఁ దోఁచక వెఱ్ఱిపట్టిన వేఁపిచందమున నాపగలు
మూఁడుజాములవఱకు నాహారముసైతము మాని చింతా
సముద్రములో మునుఁగుచుం దేలుచు వంగదేశాధిపతియు
ముఖ్యమంత్రియు నగువత్సరాజును రావించి యిట్లనియెను.
"వత్సరాజా! నీవు నాకత్యంత ప్రియుఁడవుఁ బ్రధానమంత్రి
వియుఁ గావున నాసుఖదుఃఖములనుబంచుకొనఁదగినవాఁడవు.
ప్రకృతము నాకు రాఁబోవు మహావిపత్తును దప్పించి నన్నుఁ
గాపాడ నీకన్న మఱియొకఁడు సమర్థుఁడు లేఁడు. మిత్రుని గుణ
ముల దుఃఖసమయముననే కదా పరీక్షింపవలయును. లోక
ములో రాజులు ప్రియు లగుమంత్రులవిషయమై గౌరవమును
మాత్రమిత్తురు. ఆరాజులచే గౌరవింపఁబడిన యామంత్రులు
తమ ప్రాణముల నిచ్చియైన రాజు ప్రాణములఁ గాపాడుదురు.
నీవు నాకెంతయు నంతరంగ మిత్రుఁడవును, మంత్రివియు
నగుటవలన నీకెఱింగించుచున్నాఁడ. మంత్రివర్యా! ఈదిన మర్ధ
రాత్రమున భోజుని రథమున నిడుకొని యొకయరణ్యమునకు
గొంపోయి యచట నాతనిశిరమును ఛేదించి యాశిరము నంతః
పురమునకుఁ గొని వచ్చి నాకుం గనఁబఱుపవలయును. ఈపనిని
నెఱవేర్చి నామనోరథమును గొనసాగించితివేని నీశ్రమను
వ్యర్థము సేయువాఁడఁ గాను. నీయుపకారమును మఱవను.
కోరినగ్రామములఁ బారితోషికముగ నొసంగెదను."

ఇట్లు పలుకు నతనిఘోరవాక్యములు కర్ణకఠోరములై
వినఁబడినంతన వత్సరాజు ప్రాణము లెచటికో యెగిరి పోయిన



ట్లాయెను. జాతిప్రతిమవోలె నిశ్చేష్టుఁడై నిలిచి కొంతసేపున
కెట్టకేలకుఁ దెలివొంది యిట్లు విచారింపసాగెను.

"కటకటా! ఎంతటిపలుకు లీపాపపుఁజెవులవినవలసివచ్చె
ను? ఇట్టి దుర్బుద్ధి యితని కేలగలిగె? భోజునివిరోధించి యితని
కిట్టి దుర్బోధ సేయు మహాపాపాత్ముఁ డెవ్వఁడు లేఁడు గదా! ఈ
చింతయేల? ఇతఁడు జన్మమాదిగఁ బాపపుఁజర్య లేయొనర్చుచుం
డును. ఎన్నియో ఘోరకార్యములకు వెనుదీయని యీఘాతు
కుఁడు పుత్రవధకు మాత్ర మెట్లు వెనుదీయును? ఏనుఁగులఁదిను
వెంకటమ్మకు బీనుఁగులు పిండపుఁగూడే కదా! ఛీ! యిట్టివానికడ
నౌకరిగ నుండుటయు నెంతయుఁ బాపావహము" అని తనలో
ననుకొని "కానిమ్ము! శాంతవచనముల నితని దుర్బుద్ధిని మా
న్చెదఁ గాక" అని యాలోచించి ముంజునితో నిట్లనియెను.

"మహారాజా! మీరు ప్రభువు లగుటవలన నేకార్య
మేనియు భృత్యుని కాజ్ఞాపింపఁ జేయఁదగినది ముఖ్యధర్మము.
ఐనను తాము సెలవిచ్చిన కార్యమును గుఱించి యించుక
బదులు విన్నవించునల్పజ్ఞుని వచనములఁ దప్పుగఁ దలంపకుందు
రని ప్రార్థించుచున్నాఁడను. మహాప్రభూ! భోజుఁ డేపాపము నెఱుఁ
గని పసిబాలుఁడు గదా! ఇతనికి సైన్యముగాని బలముగాని పరి
వారముగాని ధనముగాని యేసహాయమును లేదు. సింధు
లుఁడు చనిపోవునపుడు రాజ్యమును భోజుని నీకుస్వాధీనపఱిచి
పోయినాఁడు. యుక్తాయుక్తముల నెఱుఁగఁజాలని బాల్యదశ
నుండియు నిన్ను దండ్రిమాఱుగనే భావించుచు నెంతయుమీ

యందు గురుభావమున నేమెలంగుచున్నాఁడు నీయాజ్ఞ నొకప్పు
డేనియు జవదాఁటిన వాఁడు గాఁడు. ఇట్టి గుణవంతుఁడు విధే
యుఁడు నగుపుత్త్రుం జంపి మూటఁ గట్టుకొనునదియేమున్నది?
తొలుత ననాలోచితముగ నొకకార్యమొనర్చి పిదపఁ బశ్చాత్తా
పము నొందుట కేవల మూఢునిలక్షణము. ఏపనిఁ జేసిన లాభము
గలుగు? ఏపనిఁ జేయకున్న నష్టము గలుగు? నని తొట్టతొలు
త నే చక్కఁగ నాలోచించి లాభము గలుగు నేని చేయుటయు
నష్టము గలుగు నేని మానుటయుఁ బ్రాజ్ఞునిలక్షణము. ఉచితాను
చితము లగుకర్మములయెడఁ బండితుఁడు ప్రయత్నపూర్వకముగ
వానిఫలమును దెలిసికొని ప్రవర్తింపవలయును. తొందరపడి
యేపనియొనర్చినను దానివిపరీతఫలము జన్మాంతమువఱకు హృద
యశల్యమై వేధించుచుండును. ఇట్లే పూర్వకాలమున దూరా
లోచనము సేయక సాహసించి తనముద్దుచిలుక నన్యాయముగఁ
జంపుకొని తరువాతఁ బశ్చాత్తాపము నొంది ప్రాణత్యాగము
సైతము సేయఁగడంగినయొకరాజపుత్త్రునిచరిత్రము వినలేదా?
సంగ్రహముగఁ జెప్పెద వినుఁడు.

పాండ్యదేశమును బాలించుచుండినవీరసేనుఁ డనురాజు
నకు శూరసేనుఁ డనునొకకుమారుఁడుండెను. ఇతని ప్రధాన
మంత్రి యగు సుమంతునకు సుబుద్ధి యనునొక పుత్త్రుఁడు
గలఁడు. ఈశూరసేనుఁడును సుబుద్ధియు బాల్యమునుండియుఁ
బరస్పరానురాగము గలిగి యొండొరుల నెడబాయక
రామలక్ష్మణులవలె సంచరించు చుండిరి. ఇట్లుండ నొక
నాఁడు వీ రిద్దఱు విహారము నిమిత్తమొకయరణ్యమున కేగిరి.



అయ్యది వేసవికాల మగుటం జేసి సూర్యుఁడు మిగులఁ దీక్ష్ణ
ముగ నాకాశమధ్యమునఁ బ్రజ్వరిల్లుచుండెను. సుబుద్ధిశూర
సేను లారెండవేఁడిమికిం దాళఁజాలక దప్పి గొని యొకమఱ్ఱి
చెట్టునీడకుఁ జేరిరి. రాజపుత్త్రునకు నోర్వఁజాలనిదప్పియయ్యెను.
ఎచ్చటఁ గనుఁగొనినను సమీపమునఁ జెఱువు గాని బావియుఁ
గాని చెలమ గాని నది గాని యేదియుఁ గనఁబడకపోయెను.
రాజకుమారునకు నోటఁ దడి యాఱిపోయెను. మాటలు తడఁ
బడుచుండెను చెవులుగడియలువడియొరులమాటవినరానిస్థితిలో
నుండెను. ఇంకఁ గొంచెము సేపూరకున్నదగగొని తప్పకమరణము
నొందు ననదగినదశ యాసన్న మయ్యెను. మంత్రికుమారుఁ
డతనిఁ జూచి దిగులొంది యెట నేనియుఁ దిరిగి జలముఁ గొని
వచ్చెదఁ గాక యని రాజపుత్త్రు నచట నుంచి యరణ్య మెల్ల
జలాశయమును వెదకఁ బోయెను. ఇంతలో నిచట మఱ్ఱిచెట్టు
పెద్దకొమ్మలలో నుండి జొటజొట నీటిబిందువులు జాఱసాగెను.
రాజపుత్త్రుఁడు మిగుల దప్పిగొనియున్నవాఁడగుటం జేసిజలబిం
దువు లెచ్చటినుండి యెట్లు పడుచున్న వని విచారింపక దరిద్రు
నకు ధననిక్షేపము దొరకినరీతి సంతసించి యామఱ్ఱియాకుల నే
దొప్ప గుట్టి యానీటిబొట్టులు దానిలోఁ బడునట్లు క్రింద
నుంచెను. ధారగాఁ బడుచున్నందునఁ ద్వరలోనే దొప్పనిండెను.
ఈరాజపుత్త్రుఁడు చిన్ననాటనుండియు నొకచిలుకం బెంచు
చుండువాఁడు. అయ్యది ముద్దుపలుకులఁ గర్ణామృతముగఁ బలు
కుచుండ వేడుకతోడ వినుచు నెల్లపుడెడఁబాయక దనయొడిలో
నుంచుకొని కాలక్షేపము సేయుచుండును. అది మిగుల బుద్ధిశాలి.

రాజపుత్రుఁడు దానిఁ బ్రాణపదమున నుంచుకొని పోషించు
చుండెను. కావునవనవిహారము సేయునపుడు సైత మాచిలుక దగ్గ
ఱనే యుండెను. ఈచిలుక రాజపుత్రుఁడు నీటిదొప్ప నెత్తికొని
జలమును ద్రావ నుద్యుక్తుఁ డగునంతలో రివ్వున నాదొన్నెపై
కెగిరి దాని బోరగిలఁ ద్రోచెను. అపుడు రాజపుత్రుని మన సెట్లుం
డును? పిపాసాతురుఁ డగుటవలన నోటియొద్ది నీటిని బోరగిలఁ
ద్రోచినయాచిలుకపై నత్యంతాగ్రహము నొందెను. ఆఁకొన్న
వాని కాకులో నన్నముఁ బెట్టి తినఁబోవుసమయమున మట్టిఁ
గొట్టిన నతని కాగ్రహము రాకయుండునా? ఆయాగ్రహమున
నుచితానుచితము లెఱుంగక పోయెను. గ్రక్కున నాచిలుకం
బట్టి పండ్లు పటపటఁ గొఱుకుచు మెడఁద్రుంచి యవలం బాఱవై
చెను. అప్పటి కాకోపము కొంచెము శమించెను. ఇంతలో మం
త్రికుమారుఁడు వన మెల్లఁదిరిగి యెచ్చటనో జలముఁ గైకొని
సత్వరముగ నేతెంచెను. రాజపుత్రుఁ డాజలము దప్పి దీఱఁ ద్రావి
శ్రమమును బాపుకొనియెను. తరువాతఁ జిలుక గనఁబడమికి
మంత్రికుమారుఁడు చింతించి 'మిత్రమా! చిలుక యెక్కడి
కేగెను' అని యడిగెను. అతఁడు తాఁ జేసినయకార్యమును
జ్ఞప్తికిఁ దెచ్చుకొని దుఃఖించి యెంతయుఁ బరితాప మొందుచు
హా! యని నిట్టూర్పువిడిచి జరిగినవృత్తాంత మంతయుఁ దెలిపి 'చి
లుకం జంపితిఁ గదా మహాపాపాత్ముఁడను' అనియెను. మంత్రిపు
త్రుఁ డాదుర్వార్త విని మహాబుద్ధిశాలి యగుచిలుక మృతిఁ
బొందుట కెంతయు శోకించి 'రాజపుత్రా! నీవు నిష్కారణ
ముగఁ జిలుకను జంపితివి. అయ్యది యాలోచింపక యేపనియుఁ



జేయ నేరదు. ఆదొప్పలోని నీటిలో నేదియో దోషముఁ గనుఁ
గొనియే యది బోరగిలఁద్రోచి యుండును' అని చెప్పి పరీక్షిం
తము గాక యని రాజపుత్రమంత్రిపుత్రులా పెద్దమఱ్ఱిచెట్టు నెక్కి
యానీరుపడినచోటఁ బరీక్షించిరి. అచట రెండు పెద్దకొమ్మలు
గాలికి నొరసికొనుచుండెను. ఆసందులో నొకమహాసర్పము
చిక్కుకొని యారాపిడివలన దానిశరీరము నజ్జునజ్జయి వసామే
దస్సులు నీటిబిందువులుగఁ గ్రిందికి జాఱుచుండెను. శూరసేన
సుబుద్ధు లది గనుఁగొని యత్యంతాశ్చర్యము నొందిరి. చిలుక
యీవృత్తాంతము దెలిసికొనియే దీనిం ద్రావిన రాజపుత్రుఁడు
చనిపోవు నని దొప్పను బోరగిల వైచెను. రాజపుత్రునకపుడు
గలిగిన దుఃఖ మింతింత గాదు. 'ఇట్టిబుద్ధిశాలి యగుచిలుకను
జంపుకొనిన జ్ఞానవిహీనుని బ్రతు కేల?' అని ప్రాణత్యాగము
సేయ నుద్యమించెను. అపుడు సుబుద్ధి పలువిధముల బోధింప
నెట్టకేలకు శాంతచిత్తుఁ డయ్యెను. కావున నోముంజమహా
రాజా! యీవృత్తాంతము నాలోచింపుము.

ఇంతియ కాక ధైర్యమువహించి భోజునిఁ జంపినను సింధులుని
మిత్రులును మహాబలశాలులు నగు రాజపుత్రులు నీరాజ్యమునం
తయు నిముసములో ధ్వంసము సేయక మానరు. పుణ్యకర్మ్మల
నొనర్చు పురుషుఁడు దుర్మార్గముల నాచరించినఁ దమంతటనే
సంపదలు నశించును. ప్రమిదలో నూనె నిండుగనుండి వత్తి
దృఢముగనున్నను సుడిగాలి వీచిన దీప మాఱి పోక యుం
డునా?. ఇవియన్నియు సర్వజ్ఞుఁడ వగునీకుఁ దెలియనివి గావు.
ఎట్టియిక్కట్టులు గలిగినను గలుగనున్నను పుత్రవధమున నొడి
గట్టుట మీవంటికీర్తికాములకుఁ బాడి గాదు."

అని పరిపరివిధముల వత్సరాజు బోధించెను. సకారణముగ లాభ నష్టములఁ దెలిపి భోజుని జంప వలదని యుపదేశించెను; కాని యతనియుపదేశ మంతయుఁ జెవిటివానిచెవిని శంఖధ్వనియయ్యెను. భోజు నెట్లయినం జంపవలయు ననునొక నిశ్చయముతో నున్నయతని కీయుపదేశములు బుద్ధికెక్కకపోయెను. కనులెఱ్ఱఁ జేసి తోఁకఁద్రొక్కినఁ ద్రాఁచువలె మండిపడి "వత్సరాజా! చాలుచాలు! ఈయుపదేశము లన్నియు నటఁ గట్టిపెట్టుము. నీవునాకు సేవకుఁడ వని నాకార్యమును దెలిపి పరిపూర్తిఁ జేయింప రావించితిఁ గాని గురుఁడవై యుపదేశము సేయు మని కాదు. ఇట్టినీతిశాస్త్రములు నీవుక్కిటిపురాణగాథలు నే నెఱుంగనివిగావు. ఇన్నిదినముల నుండియు నీవు సేవకుఁడ వనియు నేఁ బ్రభువుననియుఁ దలంచినందుల కిప్పుడది విపరీత మయ్యెను. నీతిబోధల కారంభించి యుపదేశగురుఁడవు గూడ నయితివి. స్వామికార్యము యుక్తమైనను నయుక్తమైనను విచారణ సేయకయే యొనర్చుట సేవకునకుఁ గర్తవ్యము. స్వామికార్యముఁ దీర్పనిభృత్యుని బ్రతుకు మేఁకమెడ క్రిందిచన్నులవలె నిష్ప్రయోజనము" అనిగద్దించి పలికెను. వత్సరాజిది సమయము గాదని యూరకుండి మనములో నిట్లు విచారింపసాగెను. "ముంజుఁడు కృతఘ్నుఁడు. సింధులుఁడు దన్ను భోజసమానునిఁగ భావించి రాజ్య మొసంగిన మేలును దలఁపక నిష్కారణముగఁ బసిబాలుఁ డగుభోజునిఁ జంప నాలోచించుచున్నాఁడు. ఇట్టి ఘాతుకుఁడు లోకములో నిం కెవ్వఁడు గలఁడు? ఇతని కిట్లు విపరీతబుద్ధిపుట్టుట వినాశకాలము సంభవించియే కాని వేఱు గాదు. 'వినాశ



కాలే విపరీతబుద్ధిః' అని కదా పెద్దలు వచింతురు. మఱియుఁ దా నెఱుఁగఁడు. ఒకఁడు చెప్పిన విన నేరఁడు. ఇంతకన్న మౌర్ఖ్య మేమి గలదు? ఇతనికి నీతి గఱపుటకన్న నరణ్యములో రోదనము సేయుట మేలు.

'తివిరి యిసుమునఁ దైలంబు దీయవచ్చుఁ
దవిలి మృగతృష్ణలో నీరుఁ ద్రావవచ్చుఁ
దిరిగి కుందేటికొమ్ము సాధింపవచ్చుఁ
జేరి మూర్ఖునిమనసు రంజింపరాదు.'

అను భర్తృహరివచనము కల్ల గాదు. ఇతఁ డెట్లేగిన నా కేమి?"

అని తలఁచి "మహాప్రభూ! శాంతింపుఁడు! శాంతింపుఁడు!! దేవరవారిసమ్ముఖమున నేమేమో తెలిసియుఁ దెలియక వదరితి. వాత్సల్యమున వాని నన్నింటి మన్నించి యనుగ్రహింపవేఁడుచున్నాఁడను. నేనెన్నఁడును స్వామిద్రోహము సేయువాఁడఁగాను. మీయాజ్ఞ నౌదల ధరియించి యెట్టిపనినేనియుఁ జేయ సిద్ధముగ నున్నవాఁడను" అని విన్నవించెను.

ముంజుఁడు కోపము నంతయుఁ దిగ ద్రావి వత్సరాజును గొనియాడి కర్తవ్యము నెఱింగించి వీడ్కొలిపెను.

తరువాత వత్సరాజు రథమును సిద్ధము చేసికొని సత్వరముగ భోజుఁడు విద్యాభ్యాసమొనరించుపాఠశాల కేఁగి గురువులున్నను సంశయింపక యుచ్చైస్స్వరముతో "ఓరీ భోజా! ఇట్లు రారా!" యని పలికెను. అచట నుండువా రందఱు నాశ్చ

ర్యమునొంది "మహారాజపుత్త్రుని వత్సరా జెప్పుడు నిట్లునీచముగఁ బిలిచినవాఁడు గాఁడు. ఇప్పుడిట్లు పిలుచుటకుఁ గారణ మేమొకో?" అని యందఱు విచ్ఛాయవదనులై యుండిరి. భోజుఁడాభిజాత్యము గలవాఁడగుటమి సహింప నేరక "ఓరీ వత్సా! నీవు నాపినతండ్రియగు ముంజుని సేవకుఁడవు. గౌరవాగౌరవముల నెఱుఁగక ముట్టిపొగరునఁ బ్రేలుచున్నాఁడవు. జాగ్రత్తగనుండుము" అని బెదరించెను. వత్సరాజు విని "అయ్యా! నావలనం దప్పు లేదు. నీపినతండ్రి ముంజునియానతి. ఇపుడు బలాత్కారముగ నేని నిన్నుం బిలుచుకొని రమ్మని నన్నంపినాఁడు. తరువాత దేవరచిత్తము" అనియెను.

అంత భోజుఁడు ముంజునాజ్ఞను మీఱఁజాలక యే తేరఁగా రథముపైఁ గూర్చుండఁ బెట్టికొని వత్సరా జెచటికో తీసికొనిపోయెను. ఈవృత్తాంత మెల్ల వారికిఁ దెలిసెను. "ముంజుని దుర్బోధవలన వత్సరాజు భోజునిఁ జంప నెచటికో తీసికొని పోయెను" అని యందఱు గుసగుసలాడఁ దొడఁగిరి. క్రమముగ నంతఃపురమునకుఁ దెలిసెను. భోజునితల్లి సావిత్రి హా! యని మూర్ఛిల్లి యెట్టకేలకుఁ దెలివి దెచ్చుకొని "హా! హా! నాయనా! భోజా!" యని రోదనము సేయుచు గుండెలు బాదుకొనుచు "అయ్యో! కుమారా! ఎన్నియో కష్టములఁ బడి కనుగొన్న నీ కెట్టిదశప్రాప్తించెరా! తండ్రీ! ఇఁక నిన్ను వదలి నేనెట్లు బ్రదుకుదు? ఓరీ ముంజా! దుర్మార్గ! ఎట్టిఘాతుకకార్యమున కొడిగట్టితివి? ఏకర్మము నెఱుఁగనిపసిబాలుని జంపింప నీ కెట్లు మనసు వచ్చె? భోజునకుఁ బూర్వజన్మమున శత్రువై యీజన్మమున నాపగఁ దీర్చుకొనఁ బుట్టితివి గాబోలు! హా! నీరాజ్యము నపహ



రించు నని కాబోలు నిట్టిదుర్మార్గముఁ జేయఁబూనితివి? ఛీ! ఛీ! నీజన్మము కాల్పనా" అని యనేకవిధముల దుఃఖించుచుండెను. రాజభవనమునఁ జిన్నవారుఁ బెద్దవారు స్త్రీలుపురుషులు నెల్లరు శోకసాగరములోఁ బడి దరిగానక యుండిరి. ధారానగరమంతయు రాముఁ డరణ్యమున కేగినప్పు డయోధ్యవోలె నిష్కళమై యుండెను. కొందఱు భోజునిమరణమునకు సహింపలేక ప్రాణత్యాగమును సైతము చేసికొనిరి. ముంజుఁడు చింత దీఱె నని యొక నిర్జనగృహములో నేకాంతముగఁ గూర్చుండియుండెను. పౌరులెల్లరు ముంజునిఁ బలువిధముల దూషించుచుండిరి.

ఇఁక నచ్చట వత్సరాజు మనుష్యసంచారము లేనియొక యరణ్యములోనికి భోజుని దీసుకొని పోయెను. సింహములు, పులులు, ఎలుఁగుబంట్లు మున్నగుక్రూరమృగముల యఱపులు మిగుల భయమును గలుగఁ జేయుచుండెను. మొదట భోజుఁడు భయము నొందెను; గాని కొంతసేపునకు ధైర్యము వహించి నిర్భయముగనే యుండెను. ఇట్లు పోయిపోయి యొకగొప్ప వృక్షము సమీపమున రథము నిలిపి వత్సరాజు రథము దిగెను. భోజుఁడుఁ దరువాత వత్సరాజు నానతిమెయి రథముదిగి యొక్కచో నిలువంబడియెను. వత్సరా జించుక యేనియు శంకింపక యొర నుంచి తళతళ మెరయుకత్తిని సరీలునఁ దీసి జళిపించుచు భోజునితో నిట్లనియెను. "ఓ రాజకుమారా! నిన్నిచటికిఁ గొనివచ్చిన దెందుకో యూహించితివా? నీ పినతండ్రి ముంజుఁడు తన రాజ్యము నీ వపహరింతు వని దురూహ సేసి యీనిర్జనారణ్యమున నిన్నుఁ జంపి నీశిరమును గనఁబఱుప నాజ్ఞ యిచ్చి

యున్నాఁడు. కావున నతనియాజ్ఞకు సిద్ధముగ నుండుము. ఏదేని చెప్పవలసియున్నచో నాలస్యము సేయక వచింపుము."

అని పలికిన వత్సరాజు క్రూరవాక్యములకు భోజుని మనము చలింపలేదు. ఇంచుక యేనియు భీతిల్లక వత్సరాజుతో "ఓ మంత్రీ! నీవు భృత్యుఁడవు. ముంజరాజు ప్రభువు. ప్రభువానతిచ్చినకార్యము నొనర్చుట భృత్యునకుముఖ్యము. స్వామిచిత్తమును ననుసరించి ప్రవర్తించుట భృత్యునకు ధర్మము. నాకు మృత్యువుసమీపించి యున్నసమయమున నీవు నన్ను రక్షింపసమర్థుఁడవు గావు. మృత్యువు దూరముగఁ దొలఁగి యున్నపుడు నన్నే చంపను శక్తుఁడవు గావు. మనుష్యునిబ్రదుకంతయుఁ గర్మాధీనమై యున్నది. ఇచటి కీనాఁడు మన మిద్దఱము చేరుటయు నీవలన ముంజునివలన నావలనఁ గాదు. దైవమే మనల నిచటికిఁ జేర్చెను. లంకాధీశుఁ డగురావణుఁ డెంతటివాఁడు? తనయిరువదిచేతులఁ గైలాసము నుఱ్ఱూతలూఁగించెను. దిక్పాలకుల దీమస మడంచెను. గంధర్వుల గర్వంబుఁ బాపెను. మనుజవరేణ్యుల మట్టాడెను. సకలదిగ్విజయ మొనర్చెను. అంతటివాఁ డరణ్యముననొకరికి బాధయొనర్పక ఋషివేషమున సంచరించు శ్రీరామునిభార్య సీతను దొంగిలించెను. ఈమిషవలన భగవంతుఁ డగుశ్రీరామునిచే నతఁడు మడిసెను. కావున నేరికైనను మిషలేకయే మృత్యువు గలుగనేరదు. దీనికై సంతోషించుటయు దుఃఖించుటయుఁ గొఱగానిపనులు. కావున ముంజునియానతిమై నవశ్యము నాశిరమును నఱికి యతనికిఁ జూపింపుము. ఇపుడు నేనొకయుత్తరము



వ్రాసియిచ్చెదను. నానమస్కారములతోడ నీయుత్తరమును ముంజున కిమ్ము" అని గంభీరస్వరమున నుడివెను.

మంత్రి యతనిమాటలకు సమ్మతించెను. భోజుఁ డుత్తరము వ్రాయఁ దలఁచెఁ గాని యక్కడ పేనాయుఁ గాకితము నెక్కడ దొరకును? ఇంచుక యాలోచించి కత్తిదూసి తన చేతి నడిమివ్రేలు నిరర్థక మని పరపరఁ గోసి యారక్తముతో నొక మఱ్ఱియాకుపై నొక శ్లోకమును వ్రాసి యాయాకును వత్సరాజున కిచ్చెను. దాని వత్సరాజు చదువుచుండఁగనే చేతిలోఁ గత్తి జాఱి క్రిందఁ బడిపోయెను. అర్థము సమగ్రముగ గ్రహించునరికి మరలఁ గత్తి నెత్త మనసురాక పోయెను. కనుల బొటబొట వేఁడివేఁడిబాష్పములు రాలఁ దొడఁగెను. ఆలోచించి ఖడ్గమును దూరముగ విసరివైచి బద్ధాంజలియై భోజున కెదుర నిలిచి యిట్లు విన్నవించెను. "ఓ భోజమహారాజ! నీపాండిత్యమును, స్థైర్యమును, ఇంద్రియనిగ్రహమును గనుఁగొనినది మొదలు నిన్నుం జంప నామన సిచ్చగింపలేదు. ముంజుని యన్నమును దినుచున్నందున నతనికి లోఁబడి యిట్టియకార్యము నొనర్పఁ బూనుకొంటిని. ఛీ! నాజన్మమేల? నన్ను క్షమింపుము. నినుఁ జంపనొల్ల. నాప్రార్థన మంగీకరించి నాయింటికి రమ్ము. ఇది రాత్రికాలము గాన నీయంధకారములో నిన్నెవరుఁ గనుఁగొనఁ జాలరు. తరువాత నేకాంతస్థలమున నిన్నుంచెదను. అనంతరము చేయఁదగిన యుపాయము నాలోచించెదను."

ఇట్లు పలుక భోజుఁడు మొదల సమ్మతింపకయు నెట్టకేలకు వత్సరాజు ప్రార్థనమున "శిలాశాసనముఁ బోలు దైవశాసనముఁ గడువ నెవరికి శక్యముగాదు" అని తలఁచి యట్లే కానిమ్మనియెను. తరువాత వత్సరాజు సంతసించి భోజుని రథముపై నిడికొని యొరులకుఁ దెలియకుండ రహస్యముగ నింటి కేతెంచి భోజు నొకచో నుంచెను. ఈసమాచారము గనుఁగొందు రని యెవ్వరుఁ దనయింటికి రాకుండునట్లు గృహము వెలుపలనే వచ్చు వారికి సమాధానము చెప్పి పంపుచుండెను. ఎవ్వరేనియు నాయుశ్శేష ముండినఁ బెద్దపులి వాతఁ బడియును దప్పించు కొందురుగదా! భోజుని యంగుళీచ్ఛేదముతోడనే యతనిదురదృష్టము లన్నియుఁ దొలంగెను. పిదప వత్సరాజు లోలోన భీతిల్లుచుండెను. "ముంజునకు భోజునిశిరము నెట్లు చూపింతును?" అని యొక యుపాయ మాలోచించెను. ధారానగరములో మిక్కిలి నేర్పరి యగునొక శిల్పకారుఁడు గలఁడు. అతఁ డేవస్తువు నేనియు రూపము గాని యవయవవిన్యాసము గాని మాఱకుండునటుల లక్కతోఁ జేయఁగలఁడు. ఈసంగతి వత్సరాజెఱింగి రహస్యముగ నాతనిఁ బిలిపించి భోజుని శిరస్సును బోలె నొకశిరస్సును లక్కతోఁ జేయించి మఱునాఁడు రాత్రి నాశిరస్సును గైకొని ముంజునియంతఃపురమున కేగి దానిం జూపెను. ముంజుఁ డట్టి క్రూరుఁడైనను భోజునిశిరముఁ గనుఁగొనినంతన పట్టరానిదుఃఖము వచ్చి గోలుగోలున నేడువఁ దొడంగెను. ఇతనిరోదనమును విని "భోజుఁడు మృతుఁడయ్యె. హా! హా! యని యంతఃపురస్త్రీ లందఱు వాపోవఁ దొడంగిరి. అంతఃపుర మంతయు రోదనధ్వనులచే నిండిపోయెను. తరు



వాత ముంజుఁడు తెలివి నొంది "వత్సరాజా! భోజుఁడుశిరమును ఛేదించునపు డేమైనసమాచారముఁ జెప్పెనా?" యని యడిగెను. వత్సరాజు భోజుఁ డరణ్యమున వ్రాసియిచ్చిన పత్రమును జేబులోనుండి తీసి యిచ్చి ముంజుని వలన సెలవు గైకొని తన గృహమున కేగెను. ముంజుఁ డాపత్రమును గైకొని యేకాంతమున నిట్లు చదివెను.

"మాంధాతా చ మహీపతిః కృతయుగాలఙ్కారభూతో గతః
సేతు ర్యేన మహోదధౌ విరచితః క్వాసౌ దశాస్యాన్తకః?,
అన్యే చాపి యుధిష్ఠిరప్రభృతయో యాతా దివం భూపతే
నైకే నాపి సమం గతా వసుమతీ నూనం త్వయా యాస్యతి".

"కృతయుగమునకు భూషణమై భూమి నంతయు నేలిన మాంధాత మృతి నొందెను. సముద్రముపై సేతువును గట్టి రావణాసురుని వధించిన శ్రీరాముఁడును స్వర్గస్థుఁ డయ్యెను. ఇంకను ధర్మరాజు మున్నగు ననేకులు కీర్తిశేషు లయిరి. వీరిలో నొక్కఁడేనియుఁ దా నేగునపుడు భూమిని గొనిపోయిన వాఁడు లేఁడు; కాని నీవు గొనిపోదు వని తోఁచుచున్నది."

ఈశ్లోకమును జదువుచు నేమూర్ఛాక్రాంతుఁడై శయ్యపైఁ బడియెను. 'హా భోజా! హా భోజా!!' అని పెద్దయెలుంగున ఱొమ్ము బాదుకొనుచు నేడువ నారంభించెను. పరిపరివిధముల భోజునిగుణముల నుగ్గడించుచుఁ దనయకృత్యమునకు నాత్మను దూఱుచుఁ బశ్చాత్తాపము నొందుచుండెను. మంత్రులు మున్నగువా రెన్నివిధముల నూఱడించినను బొరలిపొరలి వచ్చుదుఃఖ

తరంగములలోఁ బడి కొట్టుకొనుచుండెను. ఈదుఃఖమున నన్న
పానాదుల వదలి చింతాసముద్రములో మునిఁగి పోయెను.
మూఁడుదినములు గడచెను. ముంజుఁడు భోజవియోగమునఁ
బ్రాణములు విడువక మానఁడని యంతయుఁ దలంచిరి. వత్సరా
జీవృత్తాంతముఁ గనుఁగొని భోజునిఁ గనఁబఱచుటకిదియసమయ
మని తలఁచి దుఃఖితుండగుముంజునికడ కేతెంచి యిట్లనియెను.
"మహారాజా! గడచినదానికి దుఃఖించి ప్రయోజనము లేదు.
ఇఁకఁ గర్తవ్యము నాలోచింపవలయును. నేఁడు ప్రాతఃకాలమునఁ
బట్టణరాజవీథిలో నొకయోగిఁ గాంచితిని. అతఁడు మిగులఁ
బ్రభావశాలిగఁ గనఁబడుచున్నాఁడు. మృతిఁబొందినవారిని దన
మంత్రప్రభావమునఁ బ్రతికించునఁట. మనభోజునివృత్తాంతము
నుగూడ నతనితోఁ జెప్పితిని. అందులకతఁ డొకహోమము చే
యవలయుననియు నది చేసినఁ దప్పక భోజుఁడు తొల్లిటిరీతి నా
హోమగుండములోనుండి మంత్రప్రభావమున నుద్భవించు నని
యుఁ జెప్పెను. అతనివాక్యములు సత్యములుగనే తోఁచుచు
న్నవి. ఇట్లెందఱినో బ్రతికించెనని కింవదంతియుఁ గూడ గలదు.
కావున దేవరయాజ్ఞ యయ్యెనేని యతని రప్పించెదను."

అయ్యమృతోపమానములగు మంత్రివాక్యములు చెవిని
బడ ముంజుని ప్రాణములు కుదుటఁబడియెను. వత్సరాజును గొని
యాడి యెట్లయినను భోజుని బ్రతికించునుపాయముఁ గనుగొను
మని వీడ్కొల్పెను. తరువాత వత్సరాజు రాజమందిరద్వారమున
కెదురుగ నొకపందిలి వేయించి యందు హోమకుండమును
ద్రవ్వించెను. కాష్ఠములు లోనగువలసినహోమద్రవ్యముల నెల్ల
సిద్ధపఱచి యీవృత్తాంతమును ప్రధానమంత్రియగు బుద్ధిసాగ



రున కెఱింగించెను. బుద్ధిసాగరుఁడు యోగివేషము ధరించి వచ్చి
హోమకుండమునకుఁ జుట్టుఁ దెఱఁ గట్టించి యచట నేమేమో
జపము సేయువానివలె నటించెను. అగ్నిలో హోమద్రవ్యముల
నార్భాటముల సేయుచు వ్రేల్వఁ దొడఁగెను. అంతకు లోపలనే
వత్సరాజు భోజుని నాతెఱలోనికిఁ జేర్చెను. ముంజుఁడు హో
మప్రదేశమునకుఁ గొంచెము సమీపమునఁ గూర్చుండి యుం
డెను. రాత్రి రెండుజాములు గడచినవి. హోమము సక్రమము
గఁ బూర్తియయ్యెను. ఆసమయమున యోగీశ్వరుఁడు జయ
జయశబ్దములం బలుకుచుఁ దెఱఁ దీసి యెల్లవారుఁ గనుంగొను
నటుల భోజునీవలకుం గొనివచ్చెను. పౌరులెల్లరు నత్యాశ్చర్య
ము నొందిరి. ముంజుఁడు సావిత్రి మున్నగువారలదుఃఖము
లన్నియుఁ దీఱెను.

తరువాత ముంజుఁడు యోగీశ్వరుని నంతఃపురమునకుం
దోడ్కొని పోయి యనేకవిధముల స్తుతించి వలసినంత ద్రవ్య
మును భూషణములను బట్టుదుకూలములను సమర్పించి నమ
స్కరించి వీడ్కొలిపెను. ఇట్లు కొన్నిదినములు గడువ ముంజుఁ
డు రాజ్యసుఖములపై నాశ మాని వేదాంతజ్ఞానము గలిగి రా
జ్యమును భోజున కొప్పగింపఁ దలఁచెను. అవంతిదేశాధిపుత్రి
యు గుణవతియు రూపవతియు నగు లీలావతి యనుకన్యను భో
జునకుఁ బెండ్లి చేసెను. శుభదినమున నెల్లసామంతరాజులు సే
వించియుండ ముంజుఁడు భోజునకుఁ బట్టాభిషేక మొనర్చి విర
క్తుఁడయ్యెను. ఇట్లు భోజుఁడు విదర్భదేశమునకుఁ బ్రభువై
ప్రజలెల్లరు నత్యంతానురాగంబున మెలంగ రామరాజ్యమో
యన దేశమును జక్కఁగఁ బరిపాలించుచుండెను.

---

# 2

## కాళీదాసు.

శ్రీసుదశేషభూమండలమండనంబై రంగారువంగదేశమును సత్యవంతుఁడనురాజు పాలించుచుండెను. ఇతఁడు మిగుల ధర్మాత్ముఁడు. ఇతనికిఁ జంపకకలిక యనునొకపుత్త్రిక గలదు. రాజముఖ్యమంత్రికిఁ జూడామణి యనునొకపుత్త్రుఁ డుండెను. చంపకకలికయుఁ జూడామణియు సమానవయస్కు లగుటం జేసి చిన్ననాఁటనుండియు నెంతయు నన్యోన్యము స్నేహము గలవారై యాటలనాడుకొనుచుఁ బాటలఁ బాడుకొనుచు నుండిరి. వీరిద్దఱు విద్యాభ్యాసమునకు వేఱు వేఱు పాఠశాలల కేగుచున్నను నాసమయమునం దక్క నితరకాలములయం దొండొరు లెడఁబాయక సంతోషమున మెలంగుచుండిరి. ఇట్లు కొన్నిదినములు గడువఁ బదియేండ్లప్రాయమువారైరి. చంపకకలికకన్నఁ జూడామణి రెండో మూఁడో సంవత్సరములు పెద్దవాఁడు. ఒకనాఁడు వేడుకయై నాడుకొనుసమయమునఁ జూడామణి రాజపుత్రికతో "చంపకకలికా! మనమిద్దఱము భార్యాభర్తలుగ నుండిన నెట్లుండుమోకదా! సీతారాములవలెనుందుము కాబోలు. నీవు మీనాయనగారితో 'నన్నుఁ జూడామణికిచ్చి పెండ్లిసేయుము' అనియడుగుము. నేను గూడ మానాయనగారితోఁ జెప్పెదను. మనమారంభించిన యీ బొమ్మలపెండ్లితో మనపెండ్లి గూడ ముగియును. తరువాత మనమిద్దఱము నీలాగుననే యెప్పుడు నెడఁబాయక చక్కగ నాడుకొనవచ్చును"



అని తనబాహులతలతోఁ గంఠము గౌగిలించుకొని "అదిగో! ఆపటములోఁ జూడుము. కృష్ణుఁ డెట్లు రాధను ముద్దుబెట్టుకొనుచున్నాఁడో" అనిచంపకకలిక బుగ్గ ముద్దుఁ బెట్టుకొనఁబోయెను. చంపకకలిక చిన్నవయస్సున నున్నను మిగుల వివేకశాలిని. కావునఁ జూడామణి యనినమాటలకుఁ జీటారించుకొని రెండుచేతులఁ బట్టి యవలం ద్రోచి మిక్కిలి కోపముతో నిట్లనియెను "ఓరీ చూడామణీ! నీవు బొత్తిగ భయములేక యాడరాని పలుకులఁ బలుకుచున్నాఁడవు. నీవు మానాయనగారి సేవకుని పుత్త్రుఁడవు. నేను మహారాజపుత్త్రిని. నేనెక్కడ? నీవెక్కడ? నక్క యెక్కడ? దేవలోక మెక్కడ? ఛీ! నోరు మూయుము. ఇఁకమీఁద నిట్టిపలుగాకి పలుకులఁ బలుకకుము. లోకములో రాజకుమారులెందఱో యుండ నీపాలఁబడి రాజసేవకుని పెండ్లామనిపించుకొనుట నాకేమి తలవ్రాఁతయా? ఒకవేళ ననురూపుఁ డగు రాజపుత్త్రుఁ డెవ్వఁడును లభింపకున్నను గన్యను గానైన నుందునుగాని నీవంటివానిఁ బెండ్లాడుదునా? ఇదియె నా ప్రతిజ్ఞ గాఁదలంపుము"

చూడామణి యీప్రతిజ్ఞావాక్యములను విని నిష్కారణముగ నింత కోపించినందులకుఁ దగినప్రతీకారము చేసెదఁ గాకయని తలఁచి "ఓసీ చంపకకలికా! వ్యర్థముగ నితరుల దూఱినమాత్రన నీవుగొప్పదానవుగావు. నీవివాహముగుఱించి నీతండ్రి నాతండ్రితో నాలోచింపక యేపనియుం జేయఁబోఁడు. రాజకార్యము లన్నియు మంత్రికి స్వాధీనములు. మంత్రి యిష్టములేని దొకకార్యము జరుగ నేరదు. కావున నప్పటి కీతఁడె బ్రతికియుండినఁ గేవలమూర్ఖుఁడును దరిద్రుఁడును నగువాని

నీకు భర్తం జేయకున్న వీఁడు చూడామణి గాఁడు. ఇదియే
నాప్రతిన" అని యత్యంతకోపముతోఁ బ్రత్యుత్తర మొసంగె
ను. చంపకకలిక విని "ఓచూడామణీ! నేను నీకుఁ గాని నీతం
డ్రికిఁగాని వశ్యురాలం గాను. బలవత్తర మగుపూర్వకర్మమే
నాసుఖదుఃఖములకుఁ గారణము. దానిననుసరించియే యెల్ల
కార్యములు జరుగుచుండునుగాన నీవేమియుఁ జేయ శక్తుఁడ
వుగావు" అని సమాధానము చెప్పెను. ఇట్లు ఉభయులు బా
ల్యమునుండి పెంపఁబడినస్నేహలతనువ్యర్థమగునీవైరపుఁగరవా
లమున దెగనఱికి మాఱు పలుకక నిజగృహముల కేగిరి. ఇట్లు
కొన్నిసంవత్సరములుఁ గొన్నిఋతువులుఁ గొన్ని మాసములుఁ
గొన్నిదినములుఁ గడచినపిదప చంపకకలికయుఁ జింతామణియుఁ
బెద్దవారైరి. రాజకన్యక తనకుఁ జూడామణికిం జరిగినవివాద
మును మఱచెను; గాని చూడామణిమాత్రము మఱవక వివా
హసమయమును గాచియే యుండెను. ఇంతలోఁ జంపక
కలిక వివాహయోగ్యమగు ప్రౌఢవయస్సునున్నదని యె
ఱింగి సత్యవంతుఁడు దగినవరుని విచారింప మంత్రితో
నాలోచన మొనర్చెను. మంత్రియు నట్లే యని యొప్పు
కొని గృహమున కేతెంచి యీవృత్తాంతమును దనకొ
మారుఁడగు చూడామణి కెఱింగించెను. చూడామణి రం
ధ్రాన్వేషణము సేయుచున్నవాఁ డగుటం జేసి సమయ
మిదియే యని తండ్రితో "నాయనా! నీవు వృద్ధుఁడవు.
దూరదేశములఁ దిరిగి తిరిగి శ్రమపడఁ జాలవు. తగినకన్యావ
రుని గనిపట్టుటయు సుకరము గాదు. ఎన్నియో విషయములఁ
జక్కఁగ బరిశీలింపవలయును. ఇందులకోపికయు బుద్ధిబలమును



ముఖ్యములు. ఇంతియకాక యియ్యది యొకటి రెండు దినము
లలో నగుకార్యము గాదు. కనీనము మాస మేనియుఁ బట్టును.
ఇన్నిదినములు నీవు రాజధానిలో లేకున్న నేశత్రురాజు లేమి
రంధ్రాన్వేషణము సేయుదురో? కావున నీవు పోవలదు. నేనేగి
యెల్లదేశములఁ దిరిగి రాజకన్యక కనురూపుఁ డగువరుని
దోడ్కొని వచ్చెదను" అనియెను.

ఈమాటలు విని కుమారుఁ డింతటి బుద్ధిశాలి యగుటకు
సంతసించెను; కాని ఐనను రాజునానతి లేక స్వయముగ స్వతం
త్రించి కుమారుఁ బంపఁ దగ దని యాసంగతిని రాజున కెఱిఁ
గించెను. రాజు సంతసించి "మంత్రిసత్తమా! ఈవరాన్వేషణ
కార్యమును నీకుమారున కొప్పగించుటకన్న నుత్తమ మెద్ది
గలదు! చంపకకలికయు నీపుత్త్రుఁడును బాల్యమునుండి యతి
మైత్రితో మెలంగుచుండువారు గదా! కావునఁ జంపకకలి
కకుఁ దగినవరునిఁ జక్కఁగ విచారించి తోడ్కొని రాఁగలఁడు.
ఇతనిఁ బంపుట యెంతయు నాకు సమ్మతము" అని పలికెను.
తరువాత మంత్రి పరమానందభరితుఁడై పుత్త్రునిప్రయాణము
నకుఁ దగినపరివారమును సిద్ధపఱిచెను.

చూడామణి తనమనోరథము నెఱవేఱు ననుసంతోష
ముచే వలసినసామగ్రి నంతయుఁ గైకొని పరివారముతో
నొక్కొకదేశమునకు వరాన్వేషణము సేయ బయలువెడలెను.
రాజకన్యకయుఁ జూడామణిని వరునిదోడ్కొని రా నియో
గించుటకు సంతోషించెను; గాని బాల్యమున జరిగిన వివాద
మును గూర్చి యించుకయేనియుఁ దలంచినదిగాదు. ఇట్లు

చూడామణి ప్రయాణమై అంగకళింగనేపాళాది దేశములం దిరిగెను. ఎచ్చటను దగినవరుఁడు లభింపక పోయెను. మాసము దినములు గడచినవి.

ఒకనాఁ డరణ్యమధ్యమునఁ బ్రయాణము సేయుచు మధ్యాహ్నకాలమగుటం జేసి విశ్రాంతికై యొకచెట్టుక్రింద గూర్చుండి యిట్లు చింతింపసాగెను. "కట్టా! దేశదేశములందిరిగి తిరిగి వేసారితిని. తగినవరుఁడు లభింపఁడయ్యె! ఇఁక నాయభీష్టంబు నెఱవేరుట యెట్లు? మన్మథునిబోలు సౌందర్యము గలిగి దరిద్రుఁడై మిక్కిలిమూఢుఁ డగువాఁడు దొరకినంగదా నా యుద్దేశము సఫల మగును. అట్టివాఁడు లభించుట కడు దుర్లభంబై యున్నది. ఎన్నియో పట్టణములు పల్లెలు వెదకి వెదకి తుద కీయరణ్యముం జేరితి. ఇఁక వెదుక వలసినప్రదేశ మేదిగలదు? తలఁచిన కార్యము నెఱవేఱమి మనమున నెంతయు నుత్సాహము తగ్గుచున్నది. ఏపనియుం జేయఁ దోఁచుట లేదు. నేదలంచినవరుఁడు బ్రాహ్మణుఁడేనియు క్షత్రియుం డేనియుఁ గాకున్నను నీచకులు నేని గొంపోయి బొంకియైనఁ గార్య మనుకూలించుకొనియెదను గాక! రూపవంతుఁడును యౌవనవంతుఁడును దొరకెనేని వానికి వస్త్రభూషణాదులచే మంచి వేషము వేసి పండితుఁ డనియు శూరుఁడనియుఁ జెప్పి నా బుద్ధిచాతుర్యంబునఁ జంపకకలిక వరించునట్లు రాజపుత్రిని భ్రమింపఁజేసి మెల్లగ వివాహమును బూర్తి సేయింతు. జరుగవలసినకార్యం బింతియ. అప్పటికిఁ గాని నాకోపమునకు శాంతిగలుగదు."



అని యాలోచించి యాయరణ్యమునం గొంతసేపు విశ్రమించెను. ఇంతలో నిరువురు కోడెకాండ్రు గండగొడ్డండ్లు చేతఁ బట్టుకొని యావైపున కేతెంచుచుండిరి. వారిరూపమును సహజ లావణ్యమును వారి మొఱఁకుదనము కప్పి పుచ్చుచున్నను, ఇంచుకదృష్టి నిగిడించి యవయవ సౌష్ఠవమును గనుంగొనిన సుందరు లని తోఁచక మానదు. వేషమును బట్టి కిరాతులని మాత్ర మూహింపఁదగి యుందురు. వారిలో నొకఁడు మిగుల సుందరుఁడు. వీరిద్దఱు నే వేవో తెలివిమాలిన యెడ్డెమాటల మాట్లాడుచుఁ దాటియాకు గుడిసె గుంజలకుఁ గాబోలుఁ గొమ్మలనఱక నొకచెట్టు కడ కేతెంచిరి.

చూడామణి వారిం దిలకించి సౌందర్య లావణ్యముల కచ్చెరువంది "ఔరా! ఇట్టి సర్వలక్షణశోభితుండగు ప్రాయపువాని నింతదనుక నెచ్చటఁ గనుఁగొనలేదు. ఈతనినవ్వు మోమును, మూపురములదాఁక వ్రేలాడుచెవులును, నాజానుబాహువులును, విశాలమగు వక్షస్థలమును, అరఁటి స్తంభములవంటి తొడలును, సుందరములగు నవయవములును గనుఁగొన క్షత్రియ కుమారుఁడేనియు నై యుండి యేకారణమునో కి[illegible]లోఁ గలసియుండు నని తోఁచుచున్నది. ఐనను నిట్టి[illegible]తుఁడైన మాత్రమున లాభమేమి గలదు? చదువు[illegible]ఁడుగ నుండవలయు గదా! వీఁడట్టివాఁడేని నా మ[illegible]ము పండినదే. వేవిధముల నిట్టి[illegible]ఁడు మూఢుఁ[illegible]ఁడు. ఇంచుక సేపు వీరిచేష్టలఁ గ[illegible]యము నివ[illegible]లదు" అని యాలోచించుచుండెను. [illegible]రువాతఁ

చూడామణి వర్ణించిన సుందరుఁడగు కిరాతకుమారుఁడు గొడ్డలిం
జేతఁ బట్టి మెల్లగఁ జెట్టెక్కి యొకకొమ్మపైఁ గూర్చుండి యా
కొమ్మనే నఱికి దానితోడ నేలంగూలి అబ్బా! యనిలేచి దుమ్ము
దులుపుకొనుచు మరల నిట్లే కొమ్మల నఱకుచుఁ గ్రిందఁ బడుచు
నుండెను. ఇట్టి మూఢ్యమును చూడామణి గనుఁగొని "ఆ!
నే నెట్టివాని సంపాదింపనెంచితినో యట్టివాఁడే విధివశంబునఁ
జేకూరె. కొమ్మపైఁ గూర్చుండి యాకొమ్మ మొదలు నఱకువాఁ
డెట్టి మూఢుం డనఁదగును? కావున వీఁడే తగినవాఁడు" అని
తలంచి వానిసమీపించి "ఓ యెఱుకా! యిటురమ్ము" అని
పిలిచెను. ఆయెఱుకు మరలిచూచి యెన్నఁడు పట్టణవాసులగు
నాగరకుల మొగముఁ జూడనివాఁ డగుటవలనఁ జూడామణి
దుస్తులఁ గనుఁగొని భయపడి "అయ్యో! అయ్యయ్యో!!
ఏదో పెద్దదెయ్యము నన్ను మ్రింగివేయుటకుఁ గాఁబోలు
పిలుచుచున్నది" అని పెద్దగ నఱచుచు వెంటనున్నవానిం గౌఁగి
లించుకొనియెను. రెండవవాఁడు కొంచెము తెలివిగలవాఁడు
గాన "దయ్యముగాదురా! ఎవఁడో మనుష్యుఁడే" అని
యతని వీఁపు దట్టి యించుక భయముఁ దీర్చెను. చూడామణి
వీనియజ్ఞానమున కెంతయు నాశ్చర్యపడి "బ్రహ్మ[illegible]లో నిట్టి
వాఁడు గూడఁ గలఁడు గాబోలు" నని వారిస[illegible]ము నీరు
నట్లు వారితో "ఓ యెఱుకులారా! నేనుదయ్యము[illegible] మను
ష్యుఁడను; మీకు భయము లేదు; నా దగ్గఱకు ర[illegible]" అని
యనేకవిధముల వారికిఁ దనస్వరూపమును దెలిపి కొం[illegible]తవఱకు
నమ్మించి "ఓబాలులారా! మీలో నొక్కఁడుమాత్రము [illegible]ఁ



గావలసియున్నాఁడు" అని "ఓరీ! నావెంట వచ్చెదవా?" యని
యాసుందరు నడిగెను. వాఁడు బెదరి బెదరి చూచుచు
"ఓరన్నా! ఇది దయ్యముగాదంటివి గదా! ఒకఁడు మాత్రము
గావలసియున్నాఁ డని నన్ను చూపుచున్నది?" అనిసుందరుఁడు
రెండవవానితోఁ బలికెను. "ఓరీ! నిజమేరా" యని యిద్దఱు
గొడ్డండ్ల నక్కడఁ బాఱవైచి రివ్వునఁ గాలికొలఁదిఁ బరువెత్త
సాగిరి. చూడామణి సామ దాన భేద దండోపాయముల నెట్లే
నియు వీనిం గొనిపోవలయు నని తలఁచి వెంట నంటి వారి పరుఁ
గుఁ జిక్కించుకొనఁజాలక తుద కతిప్రయాసమున భటులచేఁ
బట్టి తెప్పించెను. వారిద్దఱు గడగడ వణఁకుచుండ మంచిమా
టలఁ జెప్పియు బెదరించియు వారి లోఁబఱచుకొని యసభ్యపుఁ
బలుకులఁ బలుకకుండునట్లు పలువిధముల బోధించియాసుందర
కిరాతుని ననేకములగు రత్నాభరణముల చేతను బట్టుపీతాంబర
ముచేతను నలంకరింపఁ జేసి రథముపై గూర్చుండఁ బెట్టుకొని
ప్రయాణ మయ్యెను. రెండవవాఁడు కుయ్యోమొఱ్ఱో యని
మొఱపెట్ట నతనికిఁ దినుబండములను గొన్నిరూకల నిచ్చి
సంతోషపఱిచి పల్లెకుఁ బంపెను.

చూడామణి లబ్ధమనోరథుఁడై యూరి కేతెంచుచు
మార్గ[illegible]మునఁ బట్టణములలోని పెద్దపెద్ద మేడలఁ గనుఁగొని
యత్యాశ్చర్యమున నామూఢుఁ డాడువెఱ్ఱి తొఱ్ఱి కూఁతల
వారించి "ఓరీ! మాట్లాడకుము. నీకు రాజు కూఁతురిం బెండ్లిఁ
జేసెదను. అంతదనుక నోరుమూసికొని యుండుము" అని

యాశపెట్టెను. అతఁడు చూడామణి యానతి జవదాఁటిన నేమి చేయునో యని రెండు చేతుల నోరు గట్టిగా మూసికొనెను. చూడామణి యది చూచి ఛీ! యింతమొఱకువాని నింతవఱకు నెచ్చటం గనుంగొనలేదని తలఁచి "ఓరీమూఢుఁడా! మాట్లాడకుండు మని యంటిని గాని రెండుచేతులతో నోరుమూసికొను మనలేదు" అని యతని నోటిమీఁదినుండి చేతులు దీయించి కొన్ని కొన్నిశబ్దముల వానినోటఁ జెప్పించుచుండెను.

ఇట్లు రెండుమూఁడు దినములలో నిజపురమును సమీపించి చూడామణి తాను వరునిఁ బిలుచుకొనివచ్చు వృత్తాంతమును రాజునకుఁ దెలియఁజేసెను. రాజును మంత్రియుఁ గొందఱు పౌరులును జక్కని వరుని గొనివచ్చెఁ గాబోలు నని పరమానందభరితులై యెదురుగ నేగి యొక్క దివ్యభవనమున విడిది సేయించిరి.

తరువాత సత్యవంతుఁడు చూడామణిని రావించి యావరునివృత్తాంతము నడిగెను. చూడామణి యీలాగున వక్కాణించెను.

"రాజవరేణ్యా! మనమిన్నిదినముల నుండి వరాన్వేషణమునకై పడిన కష్టము లన్నియు నేఁటికి సుఖరూపములయినవి. నీ వొనరించిన పూర్వపుణ్యముల పంట నేటికిఁ బండినది. నేఁడు మీవంశమంతయుఁ బావనమయ్యెను. ఇపుడు నీకుమారికి లభించినవరుఁడు మనుజరూపము దాల్చిన సరస్వతియే యనఁదగియున్నాఁడు. ఎన్నెన్నియో దేశములఁ దిరిగి తిరిగి తుదకు గాడదేశమునుండి యీమానవలోకబృహస్పతిని గొనివచ్చితిని.



ఇతఁడు మహాశూరుఁడు. మహావిద్వాంసుఁడు. ఇతనికిఁ దెలియనివిద్య యేదియు లేదు. రూపమునుగనుఁగొని యుంటిరే కదా! ఇతఁడు నీకూఁతునకుఁ దగినవాఁడు. ఉత్తమవంశజాతుఁడు. నాయొనర్చిననిర్బంధమున నీకొమార్తెపాణిగ్రహణమునకొడంబడి మీవంశము ననుగ్రహింప నిచ్చటికేతెంచియున్నాఁడు."

అనిపలుకు చూడామణి వచనములు రాజునకుఁ గర్ణామృతములయ్యెను. తరువాత రాజబంధువులు కొందఱు వరునిం జూడ నేగిరి. కాగడా వేసి వెదకినను గుక్షిలో నేమూలనేని యొకయక్షరముగూడ లేకున్నను జూపులకుమాత్ర మతిసుందరుఁడు. వారందఱు నితనిసౌందర్యముఁ గనుఁగొని విభ్రాంతులై చూడామణి చెప్పినమాటలు స్వభావోక్తికి సైతము చాలవనియే తలంచిరి.

తరువాత నెల్లరు సమ్మతింపఁ దనతనయ కనురూపుఁడని తలఁచి రాజు శుభదినమున శుభముహూర్తమున వివాహము సేయ నిశ్చయించెను. అంతదనుక నీయొఱుకువానిఁ దొట్రిమొఱ్ఱికూఁతలఁ గూయకుండ నాఁకట్టుట చూడామణికి విశ్వప్రయత్నమయ్యెను. వరునిఁ బరీక్షింప దర్శనమునమిషఁ బెట్టుకొని యెందఱెందఱో వచ్చుచుం బోవుచుండిరి. ఈవాడుక యన్నిదేశములలో నన్నికాలములయందును సహజమై యున్నదిగదా!

ఆ సమయములయందుఁ జూడామణి దగ్గఱనే యుండి వాని నోరు దెఱవకుండ నిర్బంధించియున్నను నొకానొకప్పుడు దనయొఱుకుచేష్టలం గనఁబఱచుచునే యుండును. ఐనను వాని

యసందర్భపుఁ బ్రలాపములనెల్లఁ జూడామణి తనవాక్చాతుర్యమున సమర్థించుచుండెను. ఇట్లు నాలుగుదినములు నాలుగు యుగములుగఁ గడచెను.

మఱునాఁడు వివాహముహూర్తమని యెల్లెడలం జాటించిరి. సకలసామంతరాజులు పరివేష్టించియుండ మంగళవాద్యములు దశదిశలఁ బ్రతిధ్వను లీనుచుండ శుభముహూర్తమునఁ గళ్యాణమంటపముం జేర్చి చూడామణి యెట్టెట్లో వివాహముం బూర్తిచేయించెను. వధూవరులు యౌవనప్రాయమున నున్నందున వివాహానంతరము గర్భాధానమునుగూడ జరుపవచ్చునని యెంచి కర్తవ్యక్రియాకలాపముల ముగించిన పిదప వధూవరులఁ బడకటింటిలోనికిం బంపిరి. అయ్యది దివ్యమణులచేఁ గట్టఁబడి నాలుగువైపుల నిలువుటద్దముల నలంకరింపఁబడియున్నందున నీయారణ్యకవరుఁడేమియుఁదోఁపక మార్గము దెలియక యెట్టకేలకు నతిప్రయాసమున గదిలోనఁ బ్రవేశించెను.

వరుఁ డీలాటి విచిత్రము లెన్నఁడుఁజూచినవాఁడుగామి నేమేమో వికల్పములఁ జెప్పఁజూచుచుఁ జూడామణివలనిభయమున మాట్లాడకయే యుండెను. ఇఁకఁ జంపకకలిక యతిలావణ్యవతి. మహామేధావిని. బహుకాలము గురుశుశ్రూషయొనర్చి యాచార్యముఖమున ననేకవిద్యల గ్రహించిన విద్వాంసురాలు. ఇట్టిసకలగుణగణశోభితయగు చంపకకలికయెక్కడ? అడవిలో గాడిదలఁ గాయునీయెఱుకువాఁడెక్కడ? విధాతయొనర్చిన దాంపత్యవైభవ మెట్లున్నదో చూడుఁడు.



ఇంతలోననే యీవరుఁ డప్పుడప్పుడుఁ దనప్రయత్నము లేకయే ప్రమాదవశమున నుచ్చరించు గ్రామ్యోక్తులవలనను, పలుకరించినను బలుకక బెల్లముగొట్టినరాయివలె నూరకయుండుటవలనను జంపకకలికచెలికత్తియలకుఁ బెండ్లికొడుకునందనుమానము గలిగి యొండొరు లేమేమో గుసగుసలాడుకొనఁదొడంగిరి. ఐనను గార్యముముగిసినపిదప మూఢుఁ డని తెలిసియు నేమి లాభము గలదు? గతజలసేతుబంధనమేకదా!

తరువాత గ్రీడామందిరమున దాసీజనము సంగీతోపకరణము లగు వీణమున్నగు నన్నిసాధనముల సిద్ధపఱిచి వెడలిపోయిరి. పెండ్లికుమారుఁడు కేళీమందిరమునకుం బంపుటయె తొందరగ మెత్తనిపఱుపు లభించెఁగదాయనిశయ్యపైఁబరుండి గుఱకలువెట్టుచు నిద్రింపసాగెను. చంపకకలికయుఁ బ్రౌఢయగుటం బ్రియుండుదన్నుఁ జేరఁవీయమికిఁ గారణమేమోయని చింతించుచు విరహాగ్నిలోఁబడి వేఁగుచుండెను. కొంతసేపాలోచించి మార్గాయాసమునం గాబోలుఁ బ్రియుండు నిద్రాపరవశుం డయ్యె నని యెంచి యల్లన నిద్ర లేపఁ దలఁచి, అత్తరు, పన్నీరు, మున్నగు సుగంధ పుష్పసారములఁ బైఁజిలికెను. కొంత సేపు తాల్గరఁగునట్లు మనోహరంబుగ వీణాగానముఁ జేసెను. ప్రియునకు మెలకువ రాలేదు.

తరువాతఁ గాత్రమున మధురముగఁ బాడెను. వీవన గైకొని మెల్లగ వీచెను. ఎన్నియోసుకుమారములగు ప్రబోధనోపాయముల నొనర్చెను. ఎన్ని చేసిననేమి? ఆమహిషప్రాయున

కేమి తెలియఁగలదు? ఇట్లు కొంతసేపుదనుక నుపచారములు సేసి విసిగి యొక్కచో నల్లనఁ గూర్చుండెను. ఇంతలో గుండెలు దల్లడిల్ల నాగుబాము బుసకొట్టినట్లు ధ్వని వినిపించెను. చంపకకలిక దిగులొందెను. ఆధ్వని యేమయినదియు నూహింం పకపోయెను. అటునిటు నాలుగుదిక్కులఁ గలయఁ బరికించి చూచెను. అది మఱేమియుఁ గాదు. ఆ రసాభాసపుఁ బెండ్లికొడుకు నిదురలోనిగుఱక; చంపకకలిక యావికారపుగుఱక తన ప్రాణనాథుని దని తెలిసికొని చిత్తమున నెంతయుఁ దత్తరమొందసాగెను.

"కట్టా! నాప్రాణనాయకుఁడే యిట్లు గుఱక వెట్టుచున్నాఁడు. ఇవ్విధముచూడ నతిచిత్రముగ నున్నయది. ఉత్తమపురుషుని లక్షణములతో నొప్పారునితనిదివ్యశరీరసౌందర్యమెక్కడ? కేవలము దుర్భగుల కుండఁ దగినయీయవలక్షణపుగుఱకయెక్కడ? ఇదియితనికిఁ జంద్రునికిఁగళంకమువోలెఁగనఁబడుచున్నది. ఇట్టిగుఱకయు గాఢనిద్రయు శరీరాయాసంబున గలుగునదియుఁ గలదు. వివాహకార్యసమ్మర్దమున వేళకు నిద్రాహారములు లభింపక యతిపరిశ్రాంతిం బొంది యీసుకుమారుండిట్లుండెఁగాబోలు! దగ్గఱ కేగి నాహసించి తట్టిలేపెదఁగాక" అని తనలజ్జను బుజ్జగించి మంచమునకు డగ్గరించెను.

ప్రియుండాహంసతల్పమున మోఁకాళులుగడుపులోనికిఁ దూర్చుకొని వికారముగ వానలోఁ దడిసిన గువ్వవలె ముడుచుకొని పరుండియుండెను. ఇయ్యది భాగ్యవంతులకు లక్షణము గాదు. రెండవయవలక్షణమును గనుఁగొని చంపకకలిక హృద



యము మరల సంశయించెను. ఎట్టకేలకుఁ జిత్తమును సమాధానపఱుచుకొని యల్లనఁ జెక్కిలినొక్కి ముద్దాడెను. అతఁడు ఛీ! ఛీ! యని సీత్కారమొనర్చి చేతులంబట్టి యావలకుఁ ద్రోచివైచి నోరుదెఱచుకొని వెల్లకిలం బరుండెను.

చంపకకలికమరలనిదానించి 'చూచెదఁగాక' యనికస్తూరీ కర్పూరాది సుగంధద్రవ్యములచే గమగమఁ గమ్మని వాసనలీను తమ్ములము నాతని నోట నుమిసెను. అంత నాయెఱుకుపెండ్లికొడుకు కేకరించుకొని "ఓరీ! ఈగాడిదెపెంటికలు వేయుచున్నది పెంటకట్టునకుఁ దోలుకొనిపోరోరి వీసన్నా!" యని పెద్దగ నఱచుచు లేచెను.

ఇంకనుమూఢశిరోమణియనుటకుసంశయమేముండును? చంపకకలిక కిట్టిమూఢపతిదనకు లభించెనని తెలిసినవెనుక నెట్లు పరితపించియుండునో చదువరు లూహింతురుగాక.

చిత్తరువుబొమ్మవలె నిశ్చేష్టితయై నిలిచెను. చూడామణి మోసపుచ్చి యిట్టి యవలక్షణుని దనకు భర్తగఁ జేయునని కలలోనైనం దలంచియుండలేదు. దైవఘటనం దప్పింప నెవ్వరి తరము? "హా! ఈతఁడు గాడిదలఁగాయు మూఢజనుఁడని తెలిసినది. సకలవిద్యాపారంగతుఁడగు ప్రియునిఁ బడయఁగోరిన యీ చంపకకలిక కిట్టి దుర్భగుఁడు, మూఢుఁడు, అనాగరికుఁడు, గాడిదలఁగాయువాఁడా పతియయ్యె. అయ్యో నాయనా! హా తల్లీ! నాకొఱకుఁ బడరానిపాట్లం బడి విద్యావంతుఁడగునల్లునిసంపాదించుకొని యానందింపఁదలఁచితిరిగదా! సకలగుణగణశోభితు

లగు రాజకుమారుల నొల్లక యీచంపకకలిక గాఁడెవలఁగాయు
వానిఁ జేపట్టె నని విని మీమానసంబు లెట్లు పరితపించునో
కదా! అంతదనుక నే బ్రతికియే యుండవలయునా? రజ్జువిషా
గ్నులు దొరకవా? దొరకిన నేమి? ఆత్మహత్యయు నంధతా
మిస్రాది నరకములం బొందించు నని కదా పెద్దలు చెప్పుదురు.
ఇఁక నేమి సేయుదు. ఎవ్వరితోఁ జెప్పుకొందు" అని యనేకవిధ
ములఁ బరితపించి యతఁడు మూర్ఖావతంస మగుటకు సంశ
యము లేదని నిశ్చయించుకొనెను.

తరువాత మఱియుఁగొంతసేపు వితర్కించి "ఇతని యత్యు
త్తమం బగు రూపంబు గనుఁగొన నుత్తమవంశజాతుఁ డనియే
తోఁచుచున్నాఁడు. శ్రేష్ఠములగు జాతిరత్నములు కృత్రిమము
లగు గాజుపెంకులతోఁ గలిసికొనుటయుఁ గలదు గదా! కావున
నితఁ డేకారణముననో యెఱుకువారిలోఁ గలసియుండవచ్చును.
ఇతఁడు కులీనుఁ డేని నా తండ్రివంశము దోషాస్పదము గాదు.
కాదేని యెంతయు నపకీర్తి గలుగక మానదు. ఇతని నే యడిగి
చూచెదఁ గాక" అని సరసకుఁ జేరఁ బోయెను. అతఁడు దయ్య
మని గడగడ వణఁకుచు భయంపడసాగెను. సామోక్తుల నతని
భయము కొంత వారించి వాని కులగోత్రాదులఁ దెలిసికొన
నెంచి యిట్లనియెను.

చంపకకలిక:—ఓ సుందరుఁడా! మీ తల్లిదండ్రులెవరు? మీ
రుండు చోటెయ్యది? మీ కులమెయ్యది? మీ నామమేమి?

వరుఁడు:—మా యయ్య యెఱుకురాజు. మా తల్లి యెఱుకులసాని.
మా యూ రేమో పేరేమో కులమేమో నాకుఁ దెలియదు.



చంపక:—నీ వా యెఱుకవారిగర్భమున జనించినవాఁడవేనా?

వరుఁడు:—ఆఁ! కాను. నన్ను వారు చిన్నతనమునుండియుఁ
బెంచిరి.

చంపక:—అప్పటికి నీవు కిరాతులలోఁ గలసినవాఁడవే కదా?
ఏ దంపతులకుఁ బుట్టితివి. ఎఱుకవారిలో నెట్లు కలసితివి?

వరుఁడు:—ఓసీ! యివియన్నియు నెవరి కెఱుక? మా వారలొం
డొరు లనుకొను మాటలు మాత్ర మిపుడు బుద్ధికిఁ దోఁచినవి.
చెప్పెద, తెలిసికొనఁగలవా?

చంపక:—ఏవీ తెల్పుము.

రుఁడు:—ఓసీ! ఒకనాఁడు మాయమ్మదగ్గఱి కొక యెఱుకుల
సాని వచ్చినది. ఆమె నన్నుఁ జూపుచు "సానీ! వీఁడు మీ గూడె
మునకు వచ్చి చేరినది మొదలు మీ లాభనష్టము లెట్లున్నవి?"
అని యడిగెను. మా యమ్మ దానిం జూచి "సింగీ! యీ బాపన
య్య మాలోఁ గలసినదాదిగ మాకన్నివిధముల లాభముగనే
యున్నది. గాడిదలుమునుపటికన్న వృద్ధినొందుచున్నవి. ఇంత
కన్న మనకుఁ గావలసిన దేమున్నది? వీఁడు మా గూడెములోఁ
గాలుపెట్టిన వేళావిశేషమెట్టిదో కాని యొక ముసలిగాడిదయై
నం జచ్చినది గాదు. మోకాళ్ళలదనుక వ్రేలాడు చేతులుగల
వాఁ డెచ్చట నున్నను సంపద వృద్ధిఁ బొందునఁట. వీని చేతులుఁ
జెవులు నీవు చూచినవే కదా! నే నొక గూడెములో మనవారి
లోఁ గలసిన యొక బాపనపిల్లవానిఁ జూచితిని. వాఁడు నిట్లే
యున్నవాఁడు. వాఁ డా గూడెములోఁ జేరినది మొదలెంతయు
వృద్ధిగ నున్నదఁట! అతఁడే కాబోలు నితఁడు. ఏమో!

లోఁగుట్టు పెరుమాళ్ల కెఱుక" అని మాయమ్మ యనఁగా నేను వినియుంటిని.

చంపకకలిక దావాగ్నిదగ్ధమగుచుండు వృక్షంబు పై వర్షంబురీతి నతని వాక్యామృతధారలు దనపైఁ గురియ హృదయ సంతాపము కొంచెము చల్లారెను. ఎఱుకువాఁడు గాఁ డనియు బ్రాహ్మణుఁడై యే కారణముననో కిరాతులలోఁ గలసియుండవలయుననియు నిశ్చయించుకొనెను. "గొప్పవంశమునం బుట్టిన వాని కిట్టిసౌందర్య మెట్లు కలుగును? నాయూహయు సత్యంబయయ్యె. ఎట్లైనను నితని విద్యావంతునిగఁ జేసి యితనితో సమ్మదంబున సుఖింతుఁగాక! చూడామణి తనయభీష్టము నెఱవేఱని కతమున నాపైఁ గోపగించి విద్యావంతుని గుణవంతుని రూపవంతుని రాజకుమారుని బెండ్లాడెద నని ప్రతినవట్టిన దానికిఁ బ్రతిక్రియగ నిట్టి యెడ్డెమనుష్యుని విద్యాగంధరహితుని బ్రాహ్మణుని నాకుం బతిగ నొనర్చి కష్టపెట్టఁదలంచి తన కిచ్చవచ్చిన యీమూఢుని నాకుఁ బ్రాణనాథునిఁ జేసె. ఇప్పు డాతనిక్రోధాగ్నిఁ జల్లారియుండుఁగదా! ఇతని విద్యావంతుని జేసితినేని నామనోరథంబు సిద్ధంబు. మొదటనుండియు నితనికిఁ గ్రమంబుగ విద్యల నేర్పుట సాధ్యముగానిపని. దేవతానుగ్రహంబునంగాని మహాయోగీశ్వరానుగ్రహంబునంగాని మంత్రప్రభావంబున విద్యలఁ గఱపుట యెంతయు సులభము." అని యాలోచించి యతనితో నిట్లనియెను.

చంపక:—ప్రాణవల్లభా! విద్యల నేవేని యెఱుంగుదువా?



వరుఁడు:—విద్దెయా? దొమ్మరిగడ యెక్కుటయా? గాడిదలఁ గాయుటయా? అవియన్నియు నాకుఁ దెలియును.

చంపక:—అవియన్నియు నుత్తమవిద్యలుగావు. తర్కము, వ్యాకరణము, మీమాంస, మున్నగు శాస్త్రములే యుత్తమ విద్యలు. వానిగుఱించి యడిగితిని.

వరుఁడు:—అవియన్నియు నాకుఁ దెలియవు. నాకక్కఱలేదు. నాగాడిదలే నాకున్నఁ జాలును. నాకవియె బంగారము.

చంపకకలిక యితనిమౌఢ్యము గనుఁగొనుకొలఁది దుఃఖముకన్నఁ గోప మతిశయించెను. "ఈతఁడు మనుష్య ప్రపంచములో నుండఁదగిన వాఁడుగఁ దోఁపలేదు. ఇట్టి మూర్ఖావతంసమును భర్తఁగఁ గైకొనుటకన్న నవమానమును దుఃఖము నపకీర్తియు నెద్దిగలదు?" అని యించుక యాలోచించి తరువాత నొకఖడ్గమును గైకొని ఝళిపించుచు "ఓయనాగరికుఁడా! నేనొకటనిన నీ వొకటి చెప్పెదవు. నాగరికత లేశమైన నెఱుఁగవు. నీవు నాకుఁ దగిన పతివి గావు. కావున నీఖడ్గమున నీశిరంబు నఱికి పిదప నేను ప్రాణత్యాగ మొనర్చుకొనెదను" అని బెదరించెను.

రాజపుత్త్రిక క్రోధమునకు భయపడి యతఁడు "ఓయమ్మా! నన్నువదలిపెట్టిన నే నెచ్చటనైనఁ బ్రతికెదను. నాతల నఱికినందున నీకేమి లాభము గలదు.? నన్నురక్షింపుము!" అని భోరున నేడువఁ దొడఁగెను. చంపకకలికకు నిజముగ నతనిఁ జంపవలయునని యుద్దేశము గాదు. ఏలాగున నేని యతని లోఁబఱుచుకొని విద్యావైదుష్యమునకు మార్గమును జూపి యతనిమేలు

చూడఁ గోరియే యట్లొనర్చెను. అతనిదుఃఖమునుజూచి యామె ఖడ్గమును బాఱవైచి “భయపడకుము. దుఃఖించెద వేల ? లోకములో మూఢుఁడగుపతితోఁ గాపురము సేయు సుమంగలి కన్న విధవయే మే లని యంద ఱందురు.”

వరుఁడు:—నేను మూఢుఁడ నేల నయితిని?

చంపక:—“నీవు పూర్వజన్మమున సుకృతముఁ జేయలేదు. నీ వెఱిఁగినవిద్య యితరునికి వచ్చునేమో యను నీర్ష్యచే నెవ్వనికిం జెప్పిన వాఁడవు కావు. కావున నీ వీజన్మమున మూఢుఁడ వయితివి?”

వరుఁడు:—ఐన నే నిప్పుడేమి చేయుదును?

చంపక:—ఈపట్టణమునకు వెలుపల నొకకాళికాదేవాలయము గలదు. దానికి సమీపమున నొకయోగీశ్వరాశ్రమమున్నది. అందు గాళీచంద్రుఁ డనునొకయోగి తపము చేయుచుండును. అతఁడు మిక్కిలి ప్రభావము గలవాఁడు. వానికడ కేగి విద్య గావలయు నని ప్రార్థింపుము. కాళీమంత్రము నుపదేశింపఁ గలఁడు. ఆమంత్రము త్రికరణశుద్ధిగ జపము సేసిన నన్నివిద్యలుఁ గరతలామలకము లగును.

వరుఁడు:—అట్లయిన నా దేవాలయమునకు మార్గము చూపఁ గలవా?

ఇట్లు వధూవరుల సంవాదమునే రాత్రిమూఁడుజాములు గడచెను. రాజకన్యయుఁ దనభర్త విద్వాంసుఁడు గాఁగలఁడని యెంతయు సంతసించి యతని రూపలావణ్యాదులం దల





పోయుచు “ఇట్టిసుందరునకు విద్యయు లభించెనేని కుందనంపు బంగారునకుఁ దావి యబ్బినట్లు గదా” అని తలఁచెను.

తెల్లవాఱుజామున నేరికిఁ దెలియకుండఁ గాళికాదేవాలయమునకు మార్గముఁ జూపెను. అతఁడు భార్య యొనర్చిన జ్ఞానోపదేశమువలనఁ గొంచెము తెలివి గలిగి మెల్లనఁ గాళికాలయమునొద్ద నున్న యోగీశ్వరాశ్రమములోనికిం బోయెను. అచటఁ గాళీచంద్రుఁడు ప్రాతఃకాలమున సంధ్యాద్యనుష్ఠానము లందీర్చుకొనుచుండెను. ఆయోగీశ్వరు సేవించినంతనే యతని మనమున నొకవిధ మగు వికాసము జనించెను. అపుడు “ఛీ! ఛీ!! నాభార్య పలువిధముల నన్నవమానించినది. తుదకు నా మౌఢ్యమునకు విసిగి చంపుటకు సైతము ప్రయత్నించినది. ఇట్టి నామూఢపు బ్రతుకేల?” అని తనపూర్వవర్తనముపై రోఁతజనించెను. మహాత్ములదర్శనము సైత మిట్టిమనోవికాసమును గలుగఁ జేయఁ జిరకాలము వారిసహవాసమును వారియుపదేశము నెంతటి జ్ఞానమును గలుగఁ జేయంజాలదు ?

అంతఁ గాళీచంద్రుని ప్రాతఃకాల కృత్యము లన్నియు ముగిసెను. తరువాత నక్కిరాతకుమారుఁడు రెండుచేతుల జోడించి సాష్టాంగముగ నమస్కార మొనర్చి “స్వామీ! నీవే గతి” యని రెండుపాదములం బట్టుకొనియెను. కాళీచంద్రుఁ డతనియారాటమును గనుఁగొని జాలింబడి “బాలుఁడా! నీవెవ్వఁడవు?” అని యడిగెను. ఇతనికిఁ దనవృత్తాంత మంతయుఁ దెలియకయుఁ దెలిసియుఁ దనచరిత్రను వెలిపుచ్చుటకు వలసిన

మాటలు రాకయుఁ బలుకక యూరకుండెను. మరలఁ గాళీ
చంద్రుఁడు "ఓయీ! నాకడ కేల వచ్చితివి? నేను నీకుఁ జేయ
వలసిన పనియేమి?" అని సాదరముగ నడిగెను. అతఁడు "విద్దె
విద్దె" యని మాత్రము పలుమా ఱుచ్చరించు చుండెను.

కాళీచంద్రుఁడు జ్ఞానదృష్టిచే జరిగిన వృత్తాంతము నం
తయుఁ గనుఁగొని యెంతయుఁ గరుణగలిగి "బాలకా! భయప
డకుము. నీవు దేవీయనుగ్రహమున మహావిద్వాంసుఁడవు గాఁ
గలవు. ధైర్యము వహింపుము" అని యతని నోదార్చి యప్పు
డే స్నానాదికృత్యముల నిర్వర్తింపఁ జేసి కాళీమంత్రమును సాం
గముగ మూఁడుమాఱు లుపదేశించి "బాలకా! ఈమహా
మంత్రము నేకాగ్రచిత్తముతోఁ గాళీదేవాలయము వాకిటఁ
గూర్చుండి మూఁడుదినములు రాత్రియుం బవలు జపము
సేయుము. దేవి నీకుఁ బ్రత్యక్షము గాఁగలదు. 'దేవీ! విద్య
నొసఁగుము' అని యడుగుము" అని చెప్పెను.

అతఁడు సరియే యని కాళీదేవాలయద్వారమున కెదు
రుగఁ బద్మాసనము వేసికొని కూర్చుండి మోటుభక్తితో నితర
ధ్యానమును వదలి జపము సేయ దొడంగెను. రెండుదినములు
గడచినవి. మూఁడవదినము ప్రాతఃకాలమున రాజపుత్త్రిక దన
ప్రాణనాథునివర్తన మెట్లున్నదియో గనుఁగొనవలయునని తన
నర్మసఖితోఁగూడ కాళీదేవాలయమున కేతెంచెను.

భర్త యుగ్రముగఁ దపము సేయుచుండెను. అతని
యచంచలమగు తపంబును గనుఁగొని యవశ్యము దేవీ ప్రసా



దము నొందఁ గలఁ డని సంతసించెను. తరువాతఁ గాళీచంద్రుని
యాశ్రమమున కేగి నమస్కరించి "స్వామీ! నాప్రాణనాథు
నెట్లు కృపఁ జూచెదరో" అని ప్రార్థించి యతని యనుగ్రహముఁ
బడసి పోవుచు భర్త వినునట్టు లొకశ్లోకమును జదివెను.

"అనిలస్య గమో నాస్తి ద్విపదో నైవ దృశ్యతే,
జలమధ్యే స్థితం పద్మం కంపితం కేన హేతునా!"

"ఈప్రాతఃకాలమున వాయువు వీచుటలేదు. పక్షియేని
యు మనుష్యుఁ డేనియుఁ గనఁబడఁడు. ఏకారణముననో నీటి
లోనితామరపూవు కదలుచున్నది."

ఇట్లు సాభిప్రాయముగఁ బలికినశ్లోకము తనప్రియునిచెవిఁ
బడియెను. రాజకన్యయుఁ జెలికత్తెయు మరల రేపాడి వచ్చెద
మని యథేచ్ఛం జనిరి. అంత నాబ్రాహ్మణుఁడు జపముచేసిచేసి
యలసిపోయెను. రాత్రి జాము ప్రొద్దుపోయినది. చంద్రోదయ
మయ్యెను. కలువలతోడనే యితనిబుద్ధియు వికాసము నొందె
ను. విద్యలన్నియుఁ గలలో సముద్రతరంగములువలెఁ బొరలి
పొరలి వచ్చునట్లు తోఁచుచుండెను. కాళికాదేవి యింకను
బ్రత్యక్షము గాలేదు.

ఆదేవి యానగరమునకుఁ బ్రధానదేవత యగుటవలన
రాత్రియంతయు ఘోరాకారమునం ద్రిశూలము ధరించి బట్ట
ణమునెల్లఁ గలయఁదిరుగుచు నేయుపద్రవములు రాకుండఁ
గాపాడుచుఁ దెల్లవాఱుజామున మరల దనయాలయమునకుఁ
జేరుచుండును. ఈసంగతి బ్రాహ్మణుఁడు గుఱుతించి కాళికాదేవి

యెవుడు వెలుపలి కేగి యున్న దని తెలిసికొని యా దేవాల
యములోనికిఁ దూఱి తలుపులు దిట్టముగ మూసికొని లోనఁ
గూర్చుండి మరల జపము సేయ నారంభించెను.

తెల్లవాఱినది. యథాప్రకారముగ దేవి యాలయము
న కేతెంచి చూడఁ దలుపులు రెండు మూసి యుండెను. వేగ
ముగవచ్చి రెండుతలుపులఁ గాలఁ దన్ని వీడకుండుటం జూచి
లోపల నెవరో ప్రవేశించి రని "ఆఁ! ఎవ్వఁడీదుర్మార్గుఁడు. నిఖి
లలోకభయంకరయగు నీకాళిక కెవ్వఁ డీయపకృతి నాచరించి
బ్రతుకఁదలఁచె. సింహముతోఁ జెల్లాటము లొనర్చు మూర్ఖుఁ
డెవఁడు?" అని భీకరముగ నఱచెను.

బ్రాహ్మణుఁడు లోపలఁ గూర్చుండి 'విద్యా విద్యా' యని
గొణుగుచుండెను. ఈరెం డక్షరములు గాళికాదేవి విని దివ్య
దృష్టిచే నెల్లవృత్తాంతము నెఱింగెను. "ఓరీ తలుపులుదీయు
ము. నీయభీష్టము నెఱవేర్చెదను" అని పలికెను; గాని యా
మొఱకుఁడు మోటుపట్టున 'విద్యా' యని యనుచుఁ దలుపు
లదీయకయేయుండెను.

కాళియుఁ దర్జించియు భర్జించియు నేమి సేసియు లాభము
లేక యతనిమూర్ఖతకుఁ గరుణ గలిగి "ఓరీ! ఈకుంచెకోల ద్రిప్ప
రంధ్రములోనుండి నాలుక వెళ్లఁ బెట్టుము" అని యానతిచ్చెను.
బ్రాహ్మణుఁడట్లు సేయనాలుక నేవియోనైదుబీజాక్షరములవ్రాసె
ను అప్పుడాతనిదశాపరిణామ మేమనివర్ణింపఁగలము? మనమింత
దనుక నెఱుకయని యతిమొఱకుఁ డనియు నాడుచువచ్చినవెఱ్ఱి



బ్రాహ్మణుఁడగునా? ఆజన్మమే కాదు. ఆ తెలివియే కాదు. ఆ తే
జమే కాదు. ఆచాతుర్యమే కాదు. ఇదియొకజన్మము. ఇదియొక
తెలివి. ఇదియొక తేజము. ఇదియొకచాతుర్యము. వేయేల?
ఆమానవుఁడే కాఁడు. ఇతఁడు కాళిదాసు. మహావిద్వాంసుఁడు.
ఇతని బుద్ధి చాతుర్యమును మన మేమని చెప్పఁగలము?
రెండవకాళియే యనఁదగియుండెను.

తరువాత దేవాలయము తలుపులు దెఱచెను. వెంటనే
త్రిశూలధారియు,భీషణాకారయు నైసాక్షాత్కరించినకాళీ దేవిని
గంగాప్రవాహ తరంగములువోలె పొంగి పొరలుచుండు కాళి
దాసునికవితాధారలు నిలువున ముంచివైచెను. కాళి యతనిస్తు
తికి సంతసించి తలఁచినపుడెల్లఁ బ్రత్యక్షమగు రీతి ననుగ్రహిం
చెను.

ఇంతలోఁ గాళిదాసునివిద్యావైదుష్యమును గనుఁగొను
టకుఁ బోలె సూర్యుఁ డుదయ మొందెను. అపుడు రాజకన్యక
యచటి కేతెంచి కాళీచంద్రయోగివలన నెల్లవృత్తాంతము
నెఱింగి పరమానందభరితయై కాళిదాసు దర్శనమున కెదురు
చూచుచుండెను. కాళిదాసు తనభార్య యేతెంచిన సంగతి
తెలియఁగనే లోదినమున నామె తనచెలియతోఁ జెప్పినశ్లో
కము స్మరణకు వచ్చెను. అద్దానికి నుత్తరముగ నామెవినున
ట్లీశ్లోకమును వక్కాణించెను.

"పాపకోచ్ఛిష్టపర్ణస్య శర్వర్యా బంధనం కృతమ్,
మోక్షం న లభతే కాంతే కంపితం తేన హేతునా."

"రాత్రి ధూమమువంటికాంతిగలదాని (తుమ్మెదను)

బందికానలో వైచినది. ఇంకను విడిపింపలేదు. కావుననే (కమలము) కదలుచున్నది."

ఈసమాధానమును విని రాజకన్యక "జారా! నేనడిగినప్రశ్నమున కింతవఱ కెవ్వఁడు సమాధానము జెప్ప లేదు. నాప్రాణనాథుఁ డించుకయేని భావము వీడక నామనోగత మగు నభిప్రాయమును వెల్లడించె. పూర్వ మెంత మూఢుఁడుగ నుండెనో విపరీతముగ నంతటివిద్వాంసుఁడయ్యె. ఇంతకు నాపూర్వపుణ్యఫలము బాగుగ నున్నయది" అని సంతసము నాశ్చర్యమును ముప్పిరిగొన మిక్కిలి భక్తివినయములతోఁ గాళిదాసుని సమీపించి నమస్కార మొనర్చి "నాథా! నీయెడ నాచేసిన యపరాధముల క్షమింప వేఁడుచున్నదాన. నామనోరథము నెఱవేఱ మీకిట్టివైదుష్యముఁ గృపసేసినయీ కాళికాదేవికి వేయివందనము లాచరించుచున్నాను. ఇఁకఁ బ్రియురాలి ననుగ్రహింప నాహృదయము వేఁడుచున్నయది." అని సాభిప్రాయముగఁ బలికెను. కాళిదాసు రాజకన్యావాక్యముల విని, "ఓరాజపుత్త్రీ! నీవు నా కేమియు నపకారము చేయమియకాక యెంతయో యుపకారము చేసినదానవు. నీఋణమును దీర్చుకొన నీజన్మములవంటివి నూఱేనియుఁ జాలవు. కేవలము మూఢదశయందుండు నన్ననుగ్రహింపనెంచి కాళీచంద్రుని దర్శనముసేయించితివి వారిమంత్రప్రభావమునఁ గాళికాదేవిదర్శనముం జేయించితివి కాఁబట్టి నీవు నాకు ప్రథమగురుస్థానము. నీకిందులకేమి ప్రత్యుపకారము సేయుదు? పూర్వము మనకున్న భార్యాభర్తృభావము నేఁటికి మూఁడు దినముల క్రిందటనే నశించినది. ఇఁకమీఁద గురుశిష్యభా



వమె నాయభిమతమైనది. కావున నన్ననుగ్రహింపుము. శిష్యుఁడా! యనిపిలువుము. నీకిదేనమస్కారము" అనియామెకుఁ బ్రదక్షిణమొనర్చి నమస్కరించెను.

రాజపుత్త్రిక నివ్వెఱపడియెను. "తానొండుదలఁచిన దైవమొండు దలంచుఁగదా! ఇట్టి రూపవంతుని విద్యావంతు నొనర్చి యతనితో సుఖింపఁదలఁచిన చంపకకలిక మనోరథము లన్నియు వ్యర్థము లయ్యెనుగదా!" అని చంపకకలిక హృదయము పరితపింపఁజొచ్చెను. అనేకవిధములఁ దన యనురాగమును బ్రకటింపఁజేసి కాళిదాసు నభిప్రాయమును మార్పఁ దలఁచెను గాని సాధ్యము గాలేదు.

కాళిదాసు నసమానసౌందర్యము రాజపుత్త్రి హృదయము నాకర్షించినదిగాని యామెదివ్యసౌందర్యము కాళిదాసు హృదయము నాకర్షింప లేకపోయె. ఔను! ఇంద్రియములు స్వాధీనములుగఁ జేసికొనిన మహానుభావు లేలచలింతురు? చంపకకలిక పలువిధములప్రార్థించెను. కాళిదాసు భార్యాబుద్ధి మహాపాతకముగఁ దలంచెను. తరువాత నిరాశురాలై రాజపుత్త్రి గోలుగోలున నేడ్వఁదొడఁగెను. కాళిదాసు మనము ధర్మసహితమే; కాని దయారహిత మయ్యెను. చంపకకలిక యత్యంతము కోపము వహించి యేమియుఁ జేయునది లేక వేఁడివేఁడి కన్నీటిధారలు జలజల రాల "కాళిదాసా! కఠినహృదయుఁడవై నా ప్రార్థనము నంగీకరింపక నాజన్మము వ్యర్థము సేసితివి. ఇటులనే నాజన్మము కడతేఱవలసినది కాబోలు! నిరపరాధినియగు స్త్రీనిట్లు కష్టపెట్టి యుసురుగొంటివి గాన నీవు స్త్రీవలననే

మృతిఁబొందెదవుగాక" అని తీవ్రముగ శపించి యతని రూప
లావణ్యాదులనే తలంచుచు నంతఃపురమున కేగి బ్రహ్మచారిణి
యై కాలమును గడపెను.

తరువాతఁ గాళిదాసు రాజపుత్రిచే శప్తుఁడయ్యును గురు
భావమునఁ బ్రతిశాపము నీయ నియ్యకొనక 'ఐన నగుఁగాక'
యని ధైర్యముతోఁ గాళీచంద్రునకుం గాళికాదేవికిం బ్రణ
మిల్లి యానతిఁ గైకొని ప్రయాణమయ్యెను. తరువాతఁ గొన్ని
దినములకు భోజరాజు కీర్తిని విని యతని రాజధాని యగు
ధారానగరమున కేతెంచెను.

---

# 3

## గోవిందపండితుఁడు.

ఒకనాఁడు భోజరాజు ప్రాతఃకాలమునఁ దెల్లని గుఱ్ఱ
మునెక్కి బుద్ధిసాగరునితోడం గ్రీడోద్యానమున కేగుచుండెను.
మార్గమధ్యమున గోవిందపండితుం డనునొక బ్రాహ్మణుఁ డెదు
రుపడి భోజరాజుం జూడక యాశీర్వదింపక కనులు మూసికొని
పోవుచుండెను.

భోజరాజు కారణమారయఁజాలక యాబ్రాహ్మణు నెచ్చ
రించి "ఓ విప్రోత్తమా! మహారాజు నగు నన్నుఁ బ్రాతఃకాల
మునఁ గనుఁగొనియు నాశీర్వదింపక కనులు మూసికొని
పోవుచున్నాఁడ వేల? నేను నీకేమి యపకార మొనరించితిని?"
అని యడిగెను.

గోవిందపండితుఁడు "రాజా! నీవు విష్ణుభక్తుఁడవు. బ్రాహ్మ
ణుల కేమియు నపకారము సేయువాఁడవుగావు. కావున నీవలన
నాకు భయము లేదు. ఐనను నీ వొకబ్రాహ్మణున కేనియు నొక
విద్వాంసున కేనియు నొక్క కాసైన నిచ్చువాఁడవు గావు.
కాఁబట్టి నీదాక్షిణ్యము నాకేమి? ఆశీర్వచనము సేసిన నాకేమి
లాభము గలదు? ఇంతియకాక యుదయమున నే లోభిమొగ
మునఁ జూచిన నున్న సంపదగూడఁ బోవునని పెద్దలు చెప్పుదురు.
మఱియు దానరహితుఁ డగు రాజును, నపుంసకుని యువతులు

వాలేఁ బండితులుఁ బ్రజలు ప్రేమింపరు. లోభివానికిఁ గోపము గలిగిన నేమి? అనుగ్రహము గలిగిన నేమి? వీనివలన నెవ్వని కేమి ప్రయోజన ముండును? లోకములోఁ జాతుర్యము లేని వాని చదువును లోభివాని సంపదయుఁ బిఱికివాని భుజాబలమును నిరర్థకములు. ఈవిషయమై నాచిన్నతనములోనే మా తండ్రి చనిపోవునపుడు "నాయనా! నీకెంతప్రియుఁ డయ్యును గాయకులు స్త్రీలు జూదగాండ్రు మున్నగువారికి లోఁబడిన లోభిరాజును మాత్రము గలనైనఁ గొలువకుము. తండ్రీ! మహాపాతకము లన్నిటిలో రెండు మిక్కిలి గొప్పవి. మొదటిది లోభివాని దర్శనము. రెండవది వాని నాశ్రయించుట. కావున రాజువివేకము లేక ధర్మమార్గముల బోధించు మంత్రులయందుఁ బెడమొగము గల్గి విద్వాంసుల నాదరింపకయున్న వాని సజ్జను లేల కొనియాడుదురు? రాజు గుణవంతుఁ డేని యతని నాశ్రయించి బ్రతికినంతకాలము సేవింపవలయును. ఆసేవవలనఁ దత్క్షణము ఫలము గలుగకున్నను గాలాంతరమున నేనియు ఫలము గలుగక మానదు.' అని బోధించెను. కావున నాతండ్రి యుపదేశము చొప్పునఁ గనులు మూసికొని పోవుచుంటిని." అనియెను.

భోజునకు మిక్కిలి యవమానముగ నుండెను; కాని బుద్ధిశాలి గావున నవిహితవాక్యములుగనే గ్రహించి యాబ్రాహ్మణునితో నిట్లనియెను.

"ఓ విప్రవర్యా! లోకములో హితముగ మాట్లాడు వారెందఱో సామాన్యముగ లభింతురు కాని ప్రకృతకాల



మున హితముగఁ దోఁపకున్నను నుత్తరకాలమున హితకరములగు మాటలను మొగమోటము లేక నుడువు వారును, ఆమాటల వినువారును లభించుట మిక్కిలి దుర్లభము. హితము గోరువారు విద్వాంసులును, విద్వాంసులు హితము గోరువారు నగుట కడుదుర్లభము. రుచ్యమును, గుణవంతము నగు నౌషధము సామాన్యముగా దొరకదుకదా."

ఇట్లు గోవిందపండితు నుగ్గడించి "ఓపండితుఁడా! నీపేరేమి?" యని యడిగెను. ఆబ్రాహ్మణుఁడు తనపేరుఁ దాను చెప్పుకొనుట పాపము గాన భూమిపై "గోవిందుఁడు" అని వ్రాసెను. అంతట రాజు "ఆహా! ఈబ్రాహ్మణుఁడు గొప్పవిద్వాంసుఁడు" అని యొకలక్షరూప్యముల నొసంగ బొక్కసగానికి నుత్తరమువ్రాసి యిచ్చి ప్రతిదినము ఘాయాస్థానమునకు వచ్చుచుండవలసిన దనియు, ఎవ్వరేని గొప్పవిద్వాంసులుఁ గవులు వచ్చిరేని వారిని సభకుఁ బిలుచుకొని రావలయు ననియుఁ జెప్పి యాపండితు నంపెను.

ఇట్లు కొన్ని దినములు గడువ ననేకదేశములనుండి కవులు శాస్త్రజ్ఞులు భోజరాజదర్శనమునకై యేతెంచుచుండిరి. వారికెల్లరకు వలసినంత ధనమిచ్చి గారవించి పంపుచుండెను. ఇట్లుండ ధనాగారములో డబ్బు మిక్కిలి తగ్గిపోవుచుండెను. దీనిం గనుఁగొని యొకమంత్రి రాజుంజేరి యిట్లనియె. "మహారాజా! లోకములో రాజులు కోశబలము గలిగిననే జయము గాంతురు. ఎవనికి నేనుఁగులు, గుఱ్ఱములు, బొక్కసమున్నగు సంపదసమృద్ధిగనుండునో వానిదేభూమి; వాఁడే జయముగల

వాఁడు; వానిని శత్రువులెదుర్కొనఁజాలరు. కావునఁగోశబలము ముఖ్యముగఁ గాపాడుకొనవలెను. అధికవ్యయముఁ జేసిన దారిద్ర్యము సంభవించును. తరువాత దరిద్రుఁ డేపనిఁ జేయఁగలఁడు?"

అని దానముఁ జేయఁగూడ దని యాలోభిమంత్రి బోధింపసాగెను. భోజుఁ డెంతయు గద్దించి "నీయట్టిలోభివాఁడు మంత్రిస్థానమున నుండఁదగఁడు" అని యతనిఁ దొలఁగించి యాస్థానమున మఱియొకని నేర్పఱిచెను.

---

# 4

## గొల్లపిల్ల.

ఒకనాఁడు భోజరాజు వేఁటాడ నొకవనమున మిక్కిలి దూర మేగియేగి మధ్యాహ్నకాల మగుటవలనఁ దీక్ష్ణములగు సూర్యకిరణములచే సంతప్తుఁడై దప్పి నొంది మిగుల వ్యాకులతం జెంది యొకవృక్షమునీడఁ గూర్చుండెను. అప్పుడొక సుందరాంగియగు నొకగొల్లపిల్ల యొకకుండను దలపై నుంచుకొని మార్గమున ధారాపురమునకుం బోవుచుండెను. భోజరాజు దానింగనుంగొని దప్పి నాపుకొనఁజాలక "ఈకన్నియ గొనిపోవు భాండములో నేదియేని పానయోగ్య మగు పదార్థ ముండినఁ దనివి దీఱఁ ద్రావి దప్పిఁ బాపుకొందునుగదా? అయ్యది యేమైనదియుఁ దెలియరాదు. అడిగి చూచెదఁగాక" అని తలఁచి "ఓతరుణీ! ఆకుండలో నేమున్నది?" అని పలుకరించెను.

ఆసుందరి రాజు దప్పిగొన్నవాఁడని తెలిసికొని యాతనిముఖకమలముం దిలకించుచు నిట్లనియె.

"హిమకుందశశిప్రభశంఖనిభం పరిపక్వకపిత్థసుగంధరసమ్,
యువతీకరపల్లవనిర్మథితం పిబ హేనృపరాజ! రుజాపహరమ్."

"ఓరాజా! మంచువలె, మల్లెమొగ్గలవలె, చంద్రునివలె నతిస్వచ్ఛమై యున్నది. బాగుగ ముదురఁ బండిన వెలగపండువలెఁ గమ్మని వాసన గలిగియున్నది. జవరాలిహస్తపల్లవ

వాఁడు; వానిని శత్రువులెదుర్కొనఁజాలరు. కావునఁగోశబలము ముఖ్యముగఁ గాపాడుకొనవలెను. అధికవ్యయముఁ జేసిన దారిద్ర్యము సంభవించును. తరువాత దరిద్రుఁ డేపనిఁ జేయఁ గలఁడు?"

అని దానముఁ జేయఁగూడ దని యాలోభిమంత్రి బోధింపసాగెను. భోజుఁ డెంతయు గద్దించి "నీయట్టిలోభి వాఁడు మంత్రిస్థానమున నుండఁదగఁడు" అని యతనిఁ దొలఁగించి యాస్థానమున మఱియొకని నేర్పఱిచెను.

---

# 4

## గొల్లపిల్ల.

ఒకనాఁడు భోజరాజు వేఁటాడ నొకవనమున మిక్కిలి దూర మేగియేగి మధ్యాహ్నకాల మగుటవలనఁ దీక్ష్ణములగు సూర్యకిరణములచే సంతప్తుఁడై దప్పి నొంది మిగుల వ్యాకులతం జెంది యొకవృక్షమునీడఁ గూర్చుండెను. అప్పుడొక సుందరాంగియగు నొకగొల్లపిల్ల యొకకుండను దలపై నుంచుకొని మార్గమున ధారాపురమునకుం బోవుచుండెను. భోజరాజుదానింగనుంగొని దప్పి నాపుకొనఁజాలక "ఈకన్నియ గొనిపోవుభాండములో నేదియేని పానయోగ్య మగు పదార్థ ముండినఁ దనివి దీఱఁ ద్రావి దప్పిఁ బాపుకొందునుగదా? అయ్యది యేమైనదియుఁ దెలియరాదు. అడిగి చూచెదఁగాక" అని తలఁచి "ఓతరుణీ! ఆకుండలో నేమున్నది?" అని పలుకరించెను.

ఆసుందరి రాజు దప్పిగొన్నవాఁడని తెలిసికొని యాతనిముఖకమలముం దిలకించుచు నిట్లనియె.

"హిమకుందశశిప్రభశంఖనిభం పరిపక్వకపిత్థసుగంధరసమ్,
యువతీకరపల్లవనిర్మథితం పిబ హేనృపరాజ! రుజాపహరమ్."

"ఓరాజా! మంచువలె, మల్లెమొగ్గలవలె, చంద్రునివలె నతిస్వచ్ఛమై యున్నది. బాగుగ ముదురఁ బండిన వెలగపండువలెఁ గమ్మని వాసన గలిగియున్నది. జవరాలిహస్తపల్లవ

ముచేఁ జిలుకఁబడినది. దీనిని (మజ్జిగను) బానముసేయుము. దేవరవారి శ్రమలెల్లఁ దొలంగును."

భోజరాజాకన్నియవాక్యామృతంబుఁ గ్రోలి సగము దప్పిఁ బాపుకొని ప్రసన్నవదనుఁడై యాకన్నియతో "సుందరీ! నీవెవరిదానవు? నీలజ్జ నీమనోహర మగుదృష్టిని సంకోచింపఁజే యుచున్నది. నీవృత్తాంతముఁ దెలియఁ జెప్పుము" అని యడిగెను.

ఆకన్యక భోజరాజుసౌందర్యముం జూచి నవయౌవనమున నున్న దగుటవలన నతని మోహించి యిట్లు పలికెను.

"ఇందుం కైరవిణీవ కోకపటలీ వాంభోజినీవల్లభం
మేఘం చాతకమండలీవ మధుపశ్రేణీవ పుష్పవ్రజం,
మాకందం పికసుందరీవ రమణీ వాత్మేశ్వరం ప్రోషితం
చేతోవృత్తి రియం సదా నృపవర! త్వాం ద్రష్టు ముత్కంఠతే."

"ఓనృపవరా! చంద్రుని కుముదినివలె, సూర్యుని జక్రవాకపంక్తివలె, మేఘమును జాతకమండలివలెఁ, బుష్పసమూహమును దుమ్మెదలపంక్తివలె, మామిడిచెట్టును గోయిలవలె, దేశాంతరగతుఁ డగు నాయకుని నాయికవలె, నాచిత్తవృత్తి యెల్లపుడు దేవరవారిని సేవించుచుండుటకు నెంతయు వేడుకపడుచున్నది."

ఆకన్నియవాక్యములకు రాజెంతయు నాశ్చర్యము నొంది "ఓతరుణీ! నాకుఁ బట్టపుదేవి లీలావతి యున్నది. ఆపె యిష్టపడకున్న నెవరిని వివాహమాడఁజనదు. కావున లీలావతి సమ్మతించెనేని నిన్నపళ్యము పరిగ్రహించెద" అని తరువాత భార్యయిష్టముమీఁద నాకన్నియంగూడ భోగ్యస్త్రీగఁ బరిగ్రహించెను.

---



# శంకరకవి.



ఒకనాఁడు భోజరాజు సకలసామంతవిద్వత్కవీంద్రులు పరివేష్టింపఁ గొలువు దీరి యుండెను. అప్పుడు శంకరుఁడను విద్వత్కవి యాసభ కేతెంచెను. భోజుఁ డతనిముఖతేజమును బట్టియుఁ జేతిలో నేమో వ్రాసినతాటియాకుండుటంబట్టియు, విద్వాంసుఁ డని తెలిసికొని స్వాగత మడిగెను. శంకరకవి చేయెత్తి "ఓరాజా! నీ కభ్యుదయము గలుగుఁగాక" అని యాశీర్వదించెను. భోజుఁడు సంతసించి యిట్లనియెను.

భోజుఁడు:—ఓ కవీంద్రా! ఆపత్రికలోని దేమి?
శంకరకవి:—పద్యము.
భోజ:—ఎవనిది?
శంకర:—నీదేనయ్యా!
భోజ:—చదువుము.
శంకర:—చదివెదను; గాని యీచామరములు వేయుజవరాంద్ర కంకణములఝుణఝుణత్కారములను క్షణకాలము వారింపుము.

తరువాత సభయంతయు భోజునియాజ్ఞచే నిశ్శబ్దముగనుండ శంకరకవి యాపత్రికం దీసి యిట్లు చదివెను.

"యథా యథా భోజయశో వివర్ధతే
సితాం త్రిలోకీ మివ కర్తు ముద్యతం,
తథా తథా మే హృదయం విదూయతే
ప్రియాలకాళీధవళత్వశంకయా."

"ఓరాజా! నీకీర్తి మూఁడులోకములఁ దెలుపు సేయుపూనికతోఁ బెరుగుచున్నప్పుడెల్లను నాప్రియురాలినల్లని ముంగురులుగూడఁ దెల్లఁబడునేమో యనుభయమున నాహృదయము మిక్కిలి పరితాపము నొందుచున్నది."

ఈకవిచమత్కృతికి సంతసించి రాజతనికిఁ బండ్రెండు లక్షలరూప్యముల నొసంగెను. సభలో విద్వాంసు లెల్లరుఁ దెల్లఁబోయి తలవంచుకొని రాజువలనిభయమువలన మాటాడకుండిరి.

నాఁటిదినము సభముగిసినపిదప భోజరాజంతఃపురమునకుఁ బోయెను. పండితులెల్లరు సభలో రాజు లేకుండుటఁ జూచి "ఔరా! భోజరాజు సవివేకమే మని చెప్పవచ్చును? వేదములను, శాస్త్రములను జక్కఁగ నెఱిఁగిన యాశ్రితకవుల కొకలక్షరూప్యములమాత్ర మొసంగెను. కేవలగ్రామ్యకవియగు శంకరునకుఁ బండ్రెండులక్షల నిచ్చెను. వీని యతిశయమేమి?" అని రాజును నిందింపఁదొడఁగిరి.

ఇట్లు సభయంతయుఁ బండితులకోలాహలముచే నిండియుండెను. ఆసమయమునఁ గనకకుండలముల ధరించి, దివ్యమగుపట్టుసాలువ నెత్తికిఁజుట్టుకొని కస్తూరిచందనము మున్నగు సుగంధద్రవ్యముల వాసనల వెదఁజల్లుచు మూర్తిమంతమగు



విలాసమువలె నతిసుందరుఁడును, మహాకవియు నగునొకమహాపురుషుఁ డేతెంచెను. వాని తేజమును గనుఁగొన స్వర్గమునుండి భూమికి దిగివచ్చిన బృహస్పతి యనఁ బ్రకాశించుచుండెను. విద్వాంసులందఱు వానిని గని యొండొరులమొగములఁ జూచుకొనుచు నూరక యుండిరి. ఆమహాపురుషుఁ డెవఁడో కాఁడు. మనకాళిదాసే వాని కన్న నంతటి తేజశ్శాలియు నంతటిసుందరుఁడు నంతటివిద్వాంసుఁడు మఱియెవఁడు గలఁడు?

తరువాత నాకాళిదాసు సభలోని విద్వాంసులఁ గనుఁగొని "భోజమహారాజుగారెక్కడ?" అని యడిగెను. "ఇప్పుడే యంతఃపురమున కరిగిరి" అని బదులు చెప్పిరి.

తరువాతఁ గాళిదాసు ప్రత్యేకముగ నావిద్వాంసుల కందఱకుఁ దాంబూల మొసంగి యచ్చోట జరిగన వృత్తాంత మెఱిఁగి శంకరకవిపై వీ రందఱు నసూయపడుచున్నారని వారి ముఖలక్షణాదులఁ బట్టి తెలిసికొని యిట్లనియెను.

"ఓవిద్వాంసులారా! భోజరాజు శంకరకవికిఁ బండ్రెండు లక్షల నేల యిచ్చె?నని తలంపకుఁడు. రాజు నభిప్రాయము మీ రెఱిఁగినవారు గారు. ఈరూప్యములలో శంకరకవి కొకలక్షయే! తక్కుంగల పదినొకండు లక్షలను, ఇతని పేరిటివా రగు నేకాదశ రుద్రుల కిచ్చెను. ఇదియే రాజాభిప్రాయము."

అని పలుక సభవా రందఱుఁ జమత్కారముగఁ దలఁచిరి. తరువాత నొకరాజపురుషుఁ డీవృత్తాంతమును భోజరాజునకుఁ దెలియఁ జేసెను. భోజరాజు తనయభిప్రాయమును గనుఁగొనిన

యతని మహానుభావునిగఁ దలఁచి భోజరాజు సభ కేతెంచెను. కాళిదాసు "మంగళ మగుఁగాక" అని యాశీర్వదించి గంభీర స్వరమున రాజుకట్టెదుర నిట్లు పఠించెను.

"మహారాజ! శ్రీమన్! జగతి యశసా తే ధవళితే
పయఃపారావారం పరమపురుషో ఽయం మృగయతే,
కపర్దీ కైలాసం కరివర మభౌమం కులిశభృత్
కళానాథం రాహుః కమలభవనో హంస మధునా."

"ఓమహారాజా! శ్రీమంతుఁడా! నీకీర్తిచే లోక మెల్లఁ దెల్లఁబడఁగా విష్ణువు పాలసముద్రమును, శివుఁడు కైలాసమును, ఇంద్రుఁ డైరావతమును, రాహువు చంద్రుని, బ్రహ్మ హంసను దెలిసికొనఁజాలక వెదకుకొనుచున్నారు."

ఈకర్ణపేయ మగుశ్లోకమును విని భోజరాజు సంతసించి తూర్పుదిక్కునుండి దక్షిణదిక్కునకు మరలెను. కాళిదాసుఁడు భోజరాజు పెడమొగము పెట్టుటఁజూచి తనశ్లోకము బాగులేదని కాఁబోలు నని తలఁచి యతని కభిముఖముగ నేగి మరల నిట్లు పఠించెను.

"నీరక్షీరే గృహీత్వా నిఖిలఖగతతీ ర్యాతి నాళీకజన్మా
తక్రం ధృత్వా తు సర్వా నటతి జలనిధీం శ్చక్రపాణి ర్ముకుందః,
సర్వా నుత్తుంగశైలాన్ దహతి పశుపతిః ఫాలనేత్రేణ పశ్యన్
వ్యాప్తా త్వత్కీర్తికాంతా త్రిజగతి నృపతే! భోజరాజక్షితీంద్ర!"

"ఓభోజమహారాజా! నీకీర్తికాంత మూఁడులోకముల వ్యాపించియుండ బ్రహ్మ పాలను నీటినిజేతఁగొని(హంస పాలను నీటినివేఱుచేయును)పక్షిసమూహములకడ కెల్లనేగుచున్నాఁడు



చక్రాయుధుఁ డగునారాయణుఁడు తక్రమును గొని (పాలతో జేర్చిన దోడుకొనును) సముద్రముల నెల్లఁ దిరుగుచున్నాఁడు. శివుఁడు ఫాలనేత్రముతోఁ జూచుచు (వెండికొండ నిప్పుచేఁగరఁగును) ఎత్తగు కొండల నెల్ల దహించుచున్నాఁడు."

ఈశ్లోకమును విని భోజరాజు పడమరముఖము పెట్టి కూర్చుండెను. కాళిదాసు "ఏల? నాదురదృష్టము గాఁబోలును రాజునకు నాకవిత్వము రుచింపలేదు" అని తలఁచి మరల నభిముఖముగ నేగి యిట్లు పఠించెను.

"విద్వద్రాజశిఖామణే! తులయితుం ధాతా త్వదీయం యశః
కైలాసం చ నిరీక్ష్య తత్ర లఘుతాం నిక్షిప్తవాన్ పూర్తయే,
ఉక్షాణం తదుప ర్యుమాసహచరం తన్మూర్ధ్ని గంగాజలం
తస్యాగ్రే ఫణిపుంగవం తదుపరి స్ఫారం సుధాదీధితిమ్."

"పండితశిఖామణి వగునోరాజా! బ్రహ్మ నీకీర్తిని గైలాసముతో సరితూప నెంచి కైలాసమే చులకన కాఁగా సరిపోవుటకై దానిపై శివునియొద్దును, దానిపై శివుని, వానిపై గంగను, దానిపై నాదిశేషుని, దానిపై దెల్లనిచంద్రకళను బెట్టి తూచెను."

మరల భోజరాజుత్తరముఖుఁడయ్యెను. కాళిదాసు పట్టుఁబట్టి యెట్లైని సంతోషపెట్టవలయు నని తలఁచి యతనికభిముఖముగ నేగి మరల నిట్లు వక్కాణించెను.

"స్వర్గాద్గోపాల! కుత్ర వ్రజసి? సురమునే! భూతలే కామధేనోః
వత్సస్యానేతుకామ స్తృణచయ మధునా ముగ్ధదుగ్ధం న తస్యాః,
శ్రుత్వా శ్రీభోజరాజప్రచురవితరణం వ్రీడశుష్కస్తనీ సా
వ్యర్థోహి ప్యాత్వప్రయాస స్తదపి తదరిభి శ్చర్వితంసర్వముర్వ్యామ్

"నారదుఁడు:—ఓరీ! గొల్లవాఁడా! స్వర్గమునుండి యెచ్చటి
కేగెదవు?.

గొల్లవాఁడు:—ఓనారదమునీ! ఇపుడు కామధేనువుదూడకు
గడ్డిఁ దెచ్చుటకు భూలోకమున కేగుచున్నాఁడను.

నార:—ఓరీమూర్ఖుఁడా! దానివద్దఁ బాలు లేవఁటరా?

గొల్ల:—శ్రీభోజరాజు ప్రసిద్ధ మగుదానమును విని దానిచన్ను
లెండిపోయినవి.

నార:—అట్లయిన నీశ్రమ వ్యర్థము గదా! భూమిలోనిగడ్డి
యంతయు భోజునిశత్రువులే తిని వేసినారు?"

తరువాత నీయద్భుతశ్లోకమును విని భోజరాజు తనసింహా
సనమునుండి లేచి సభాసదులకు నమస్కరించి "ఆర్యులారా!
నేఁడు మొదలు నా దేశమున కంతయు నీకవిచంద్రుఁ డధిపతి.
నాలుగుదిక్కులఁ గల రాజ్యము నాలుగుశ్లోకముల కిచ్చి వైచి
తిని" అని దాను వెళ్లిపోవ నుద్యమించుచుండెను.

కాళిదాసు మహాశ్చర్యము నొంది "అయ్యో! బ్రాహ్మ
ణుఁడ నగు నా కేల యీరాజ్యము? రాజ్యభారము భరింప
క్షత్రియుఁడే కదా సమర్థుఁడు" అని రాజ్యమును బరిగ్రహింప
నని దృఢముగఁ బలికెను.

తరువాత భోజరాజు బుద్ధిసాగరునియనుమతమున రాజ్య
మునకుఁ బ్రతిఫలముగఁ గొన్నిలక్షలరూప్యముల నిచ్చి కాళిదా
సునివలన మరల రాజ్యమును గ్రహించెను. అది యాదిగఁ
గాళిదాసును సరస్వత్యవతారముగ భావించుచుఁ బరమమై
త్రితో భోజరాజు మెలంగుచుండెను. ఆకృతులు రెండయి
నను భోజకాళిదాసులభావ మొక్కటియై యెల్లవిషయములం
బ్రవర్తిల్లుచుండెను.

---

# 6

# కాంచనమాల.

---

కాళిదాసు ధారానగరముఁ జేరినది మొదలు నహోరాత్ర
మును గవితామృతగంగాప్రవాహములో నీఁదులాడుచుండెను.
శృంగారవర్ణనలం జవిఁ జూచునపుడెల్లఁ బ్రియారహితుఁ డగు
నతనిమనము కట్టివేయఁబడినదయ్యుఁ జలించుచునే యుండెను.
మహోన్నతస్థానమునఁ బండితులెల్లరు సేవింపభోజరాజువశ్యుఁ
డై యుండఁ దేజరిల్లుకాళిదాసునిసహజలావణ్యరూపరేఖావిలా
సంబులు సానఁబట్టినరత్నములరీతి నాస్థానపాండిత్యబలమునఁ
బ్రకాశించుచుండెను. నవయౌవనమున నున్నవాఁడగుటం జేసి
యవయవములం గ్రొత్తక్రొత్తలావణ్య ముదయించుచుండెను.
ఇతనియాకృతిసౌందర్యముఁ గనుంగొనినఁ బురుషుని మనమే
నియుఁ జలింపవచ్చు నని చెప్పఁదగును.

ఇట్టిప్రాయమునఁ గాళిదాసొకనాఁడు విలాసముగ రాజ
వీధి నేగుచుండెను. కాంచనమాల యనునొకచక్కనిబోగము
పడుచు చేతఁ బుస్తకముఁ గైకొని విద్యాశాల కేగుచు మార్గమ
ధ్యమునఁ గాళిదాసున కెదురుపడెను. దానిఁ గనుగొనినమాత్రనఁ
గాళిదాసునిమనము జల్లు మనియెను. శరీరమంతయు గగుర్పా
టొందెను. అయస్కాంతము సూదినిబోలె దానిసౌందర్యము

కాళిదాసునిమనమునునిమిషములో నాకర్షించెను. దృష్టిచక్కఁగ
నిల్పి చూచి చూచి యచ్చెరువొంది "ఔరా! యీనవమోహ
నాంగియందం బేమని వర్ణింపఁగలము? దీనిఁగనుఁగొనినంత నే
కన్నుల కమృతరపువత్తివోలె నెంతయు నానందముగలిగించు
చున్నయది. కొన్నిదినములకు ముందుఁ గాళికాదేవాలయము
నకుఁ బోవునపుడు సాయంకాలమునఁ గనఁబడిన సుందరి యిది
యేకాబోలు! అపుడింత యౌవనము దీని కంకురించి యుండ
లేదు. నేనుఁ గార్యాంతరాసక్తుఁడనై పోవుచు నంతగఁ బరీక్షింప
నైతి. ఆహా! యెంతలో దీనియవయవము లింతలయ్యె? ఔరా!
ఎంతలో దీనిచూపులు వింత లయ్యె! ఇట్టినవయౌవనమున
వీథుల నిస్సంశయముగఁ బోవుచున్నందున నిదిబోగముపడుచై
యుండ నోపు! కావున దీనితో నించుకమాటలాడి దీనిసరసము
లగు వాక్యామృతంబులఁ గ్రోలి కొంచెము శృంగారరసము
ననుభవించి తృప్తిం జెందెదఁ గాక" యని దానిని డగ్గరించెను.

ఆకన్యకయుఁ గాళిదాసుని యతిరమణీయాకారమును
గనుఁగొని మోహించి తన్ననురాగదృష్టిచే నతఁడు చూచుట
వలనఁ దన్నుం బ్రేమించి యుండు నని యెంచి తానును సాభి
ప్రాయముగఁ జూచుచుఁ దిన్నఁగ నడుచుచుండెను. ఇద్దఱు
మిగులఁ జేరువకు రాఁగ నొకరిమొగము నొకరుచూచుకొనుచు
నిలువం బడిరి. అప్పు డిట్లిరువురకు సంవాదము జరిగెను.

కాళిదాసు:—"కా త్వం బాలే!" "ఓపడుచా! నీవెవ్వతెవు?"

కాంచనమాల:—"కాంచనమాలా"! "కాంచనమాలను".



కాళిదాసు తనలో "ఆహా! ఇది దీనికిఁ దగినపేరు. దీని
రమణీయమగు సౌందర్యమునకు విద్యయు నుండుట యపరంజికి
వాసన యబ్బినట్లున్నది" అనుకొని యి ట్లనియెను.

కాళి:—"కస్యాసి పుత్రి?" "ఎవతెకుఁ గూఁతురవు?"

కాంచన:—"కంచుకవత్యాః" "కంచుకవతికి."

కాళిదాసు "ఓహో! యీకంచుకవతి భోజరాజు పట్టపు
దేవియగు లీలావతికిఁ బ్రధాన సైరంధ్రి యనియు నతిరూపవతి
యనియు విని యుంటిని గదా! దీనిరూపము, గుణము, దానికిఁ
గూఁతు రగుటకుఁ దార్కాణములుగనే యున్నవి." అనితలంచి
మరల ని ట్లడిగెను.

కాళి:—"కిం తే హస్తే?" "నీచేతిలోని దేమి?"

కాంచన:—"తాళీపత్రం" "తాటియాకు"

కాళిదాసు:—"కా వా రేఖా?" "ఆగీఁత యేమి?"

కాంచన:—"కా ఖా గా ఘా" "కాఖాగాఘాలు"

ఇట్లు ముద్దుపలుకుల నుత్తర మిచ్చుచున్న యప్పుడుచుం
గనుంగొని కాళిదాసు మిక్కిలి యాశ్చర్యము నొందెను.
"ఔరౌరా! ఇట్టి యౌవనాంకురావస్థయందే యిట్లు రసిక
జనములమనముల హఠాత్తుగ నాకర్షించుచుండ నీఁకఁ బరిపూర్ణ
యౌవనదశలో నెంతమనోహర యై యుండును? ఇట్టి జవ
రాలిం జేపట్టిన వాఁడే ధన్యుఁడు. వానిజన్మమే సార్థకము" అని
తలపోసి చిఱునగవు నగుచుఁ బరిహాసోక్తులఁ బలుక సాగెను.

కాంచనమాలయుఁ గాళిదాసునిసుందరరూపమునకుఁ
బ్రేమించి బాలభావమున నుండుటం జేసి శృంగారచేష్టలనాఱుఁగు
పఱుచుచు నతనిపరిహాసవచనములకు మాఱుపలుకక నుందహాస

ము సేసి "ఈసుందరాకారునిపలుకులవలన మనము లజ్జాకులిత మగుచున్నది. ఇఁక నతనియెదుట నుండఁజాల" నని మార్గము తొలఁగి విలాసపుఁగ్రేగంటిచూపులంజూచుచు నింటికేగెను.

కాళిదాసును దానిగమన విలాసములఁ దిరిగి తిరిగి చూచుచు మనసును దానియంద లీనము చేసి ధ్యాన మొనర్చుచు నిల్లు సేరెను. అది యాదిగఁ గాళిదాసునకుఁ గాంచనమాలకు నొండొరులపై ననురాగమతిశయించెను. ఉభయులుఁ బరస్పర విరహమును సహింపఁజాలక వేదన నొందు చుండిరి. వీ రిద్దఱికి మరల సమాగమ మెట్లు గలుగును?.

కాళిదాసునిచిత్తము మఱియుఁ జంచలమయ్యెను. ఏకార్యము నొనర్చుటకుఁదోఁపక యుండెను. రాత్రియుంబవలు 'కాంచనమాలా! కాంచనమాలా!' అని కలువరించుచుండెను. పలుమాఱు లాకాంచనమాలయుండువీథిలోఁదిరుగుచుండెను; గాని యాసుందరి దర్శనము గగనకుసుమప్రాయమయ్యెను. ఇట్లు విరహవేదనచే నొక్కొకదిన మొకయుగముగఁ గడపుచుండెను. ఇట్లుకొన్ని దినములుగడచెను. ఒకనాఁడుపూర్ణిమారాత్రియందు గాళిదాసు కాంచనమాల యుండుసౌధముమార్గమునఁ బోవుచుండెను. కాంచనమాలయు "కాళిదాసు నెట్లుగనుగొందునా?" అని చింతాక్రాంత యై యేమియుఁ దోఁపక పైమేడమీఁద నెక్కి పండువెన్నెలలో సవిలాసముగసంచరించుచునలువంకలఁ దిలకించు చుండెను. అపుడు కాళిదా సావీథి నేగుచు దానిం గనుఁగొని దీనిదర్శనమున జన్మము సార్థకమయ్యెఁగదా యని సంతసించి దానితో నిట్లనియెను.



"ఝడితి ప్రవిశ గేహం మా బహి స్తిష్ఠ బాలే
గ్రహణసమయవార్తా శ్రూయతే శీతరశ్మేః,
తవ ముఖ మకళంకం వీక్ష్యం నూనం స రాహు
ర్గ్రసతి తవ ముఖేందుం చంద్రబింబం వినైవ."

"పిల్లా! త్వరగా నింటిలోపలికిఁ బొమ్ము. వెలుపల సంచరింపకుము. ఇపుడు చంద్రునకు గ్రహణకాలమని యందఱు చెప్పుచున్నారు. రాహువు కళంకము లేనినీముఖచంద్రునిఁ జూచెనేని కళంకము గలచంద్రుని వదలి నీమొగంబును మ్రింగి వేయును."

ఇట్లు కాళిదాసు పలికినపలుకుల విని యతనిరసికతావిశేషమునకు మనమున నెంతయు మెచ్చుకొనుచు మఱి మఱి నతనిసరసోక్తు లనునమృతంబుఁ దనివి దీరఁ ద్రావఁ దలఁచి యూరకుండ. నాకాంచనమాలయభిప్రాయం బెఱిఁగి యది ఱవికఁ దొడుగకుండుటఁ దెలిసికొని యిట్లనియె.

"కనకాంగి! కలయ కంచుక మనయో స్తనయో ర్జవేన ఘనతరయోః,
పురుహూతదిగ్విభాగా దుదయతి కోకారి రద్య పరిపూర్ణః."

"ఓ కనకాంగీ! మిక్కిలిగొప్ప వగునీ స్తనములు గనఁబడకుండ ఱవికఁ దొడిగికొనుము. ఇవి చక్రవాకము లగుటవలన వానికి విరోధి యగుచంద్రుఁ డిదె యుదయించు చున్నాఁడు. (చంద్రదర్శనమునఁ జక్రవాకములు జంట వీడిపోవును)"

ఈయమృతోపమానము లగుచతురవచనముల కల కాంచనమాల సౌధమునుండి డిగ్గి మేల్పట్టుఱవికఁ దొడిగికొని తనసొగసు నిలువుటద్దమునఁ జూచుకొని కులుకుచుఁ జెలికత్తియతోడ గృహద్వారమున నున్నరసికశ్రేష్ఠుఁ డగుకాళిదాసు

నెదుర్కొనెను. అప్పు డాకవిచంద్రుఁ డనురాగసూచకములగు చిఱునగవుల నొప్పుచుండు కటాక్షవీక్షణములఁ గాంచనమాలముఖాబ్జముఁ దిలకించెను. కాంచనమాల సిగ్గుపడుచుఁ బయఁటచెఱఁగు హస్తపల్లవమున ముఖకమలమునకు నడ్డముగ నిడికొని చిఱునగవు నగుచుండఁ గనుగొని కాళిదాసిట్లనియె.

‡"ఉచితం గోపన మనయోస్స్తనయోః కనకాద్రికాంతితస్కరయోః,
అపధీరితవిధుమండలముఖమండలగోపనం కిమితి?"

"బంగరుకొండకాంతిని దొంగలించినయీ స్తనముల దాఁచుట యుచితము; గాని చంద్రమండలముఁ దిరస్కరించు నీముఖమండలము దాఁపనేల!"

ఇట్టిచమత్కారవాక్యములఁ గాంచనమాల యానందపరవశ యై మనమునఁ బ్రేమించియు ముగ్ధ యగుట సిగ్గువడి యూరకుండెను. సఖీజను లాసుందరీభావము నెఱిఁగి యాకాళిదాసునిఁ గ్రీడామందిరమునకుఁ దోడ్కొనిపోయి హంసతూలికాతల్పమునఁ గూర్చుండఁ బెట్టి కాంచనమాల నచట వదలి యెల్లరు తొలఁగి నిజగృహముల కేగిరి. కాళిదాస కాంచనమాలలు పరమానందభరితులై యిష్టార్థముల నెఱవేర్చుకొనిరి. అది మొదలు కాళిదాసు కాంచనమాల బ్రేమించి యుండెను.

---

‡ లోకములో నితరుల సొత్తుల దొంగలించినవారి నెవరికిఁ దెలియకుండ దాఁచి యుంచుదురు. అట్లే బంగరుకొండ కాంతిని స్తనములు దొంగలించుటచే నీదొంగలను దాఁచి యుంచుట తగవు. ఇతరుల లెక్క సేయక ప్రసిద్ధులుగ నుండువారి దాఁచి యుంచుట తగవుగాదు. అట్లే చంద్రుని దిరస్కరించి యుపమానవస్తువులేక విఱ్ఱవీగు నీముఖమండలమును దాఁచి యుంచుట తగవా? యనుట.

# 7

## బాపనదొంగ.

ఒకానొకసమయమున ముఖ్యమంత్రి భోజరాజు మిక్కిలి వ్యయము చేయుచుండుటఁ గనుఁగొని సహింపక భోజరాజు శయనగృహమున కేగి యొకగోడమీఁద నీశ్లోకపాదము వ్రాసెను.

"ఆప దర్థం ధనం రక్షేత్."

"ఆపదలయం దక్కఱవచ్చుటకు ధనమును గాపాడుకొనవలయు"

భోజరాజు శయనమునుండి లేచి యాశ్లోకపాదమును జదివి మిగుల వ్యాకులత్వము నొంది యాచరణముక్రింద రెండవచరణ మిట్లు వ్రాసెను.

"శ్రీమతా మాపదః కుతః ?"

"శ్రీమంతుల కాపద లెక్కడివి?"

మఱునాఁడు మంత్రి తాను వ్రాసినచరణమునకు బదులువ్రాయుటఁ గనుఁగొని యంతట నూరకుండక మూఁడవచరణమును వ్రాసెను.

"సా చే దపగతా లక్ష్మీః"

"ఆసంపద పోయిననో?"

భోజరాజు తరువాత నాలవచరణమును సమాధానపూర్వముగ నిట్లు వ్రాసెను.

"సంచితార్థో వినశ్యతి"
"కూడఁబెట్టినధనముగూడఁ బోవును".

మంత్రి తనవాక్యముల కన్నిటికి విరుద్ధముగ సమాధానము వ్రాసి యుండుటఁ జూచి రాజు తనపైఁ గోపించె నని భయపడి ప్రణతుఁడై "రాజా! నాయపరాధమును క్షమింపవలయును" అని ప్రార్థించెను. తరువాత భోజరాజతనికి నీతి నుపదేశించి వీడ్కొలిపి శయనగృహమున లీలావతితోడ సరససల్లాపము లాడుచు శృంగారగోష్ఠిలో మెలంగుచుండెను.

ఆ రాత్రియందొకబ్రాహ్మణుఁడు జీవనాధారము లేక భోజరాజుశయనగృహమునకుఁ గన్నము వేసి లోపలఁ బ్రవేశించి యచట నుండు ననేకరత్నాభరణములను బంగారునగలను బట్టువస్త్రములను దొంగలించి మూటఁగట్టుకొని యెత్తుకొని పోవుటకు మనసురాక యాలోచించెను. "ఈరత్నాభరణములున్నగు వస్తువుల నింటియజమానునకుఁ దెలియకుండ దొంగలించితిఁగదా! దొంగతనమువలని పాప మట్లుండనీ! ఈ బాకియంతయు జన్మాంతరమునఁ దీర్చుకొనవలసినదియే కదా! కాఁబట్టి వీనితో నేమి లాభము?. లోకములోఁ బూర్వజన్మమునఁ జేసిన పాపముల చేతనే కొందఱు గ్రుడ్డివారుగను గొందఱు కుంటివారుగను గొందఱు కుష్ఠరోగులుగను గొంద ఱంగహీనులుగను గొందఱు దరిద్రులుగను బుట్టి యాయాపాపముల ఫలము ననుభవించుచున్నారు. ఇన్నియుఁ దెలిసియుఁ బాపముల కేల యొడిగట్టవలయును? జానేఁడు పోనేల? మూరెఁడుక్రుంగనేల ?."



అని యాలోచించి యాసొమ్మునంతయు నచటనే వదలి వైరాగ్యము నొంది వెలుపలికిఁ బోవ నుద్యుక్తుఁడై యుండెను.
అట్టిసమయమున భోజరాజు తనరథములు, నేనుఁగులు, గుఱ్ఱములు, సైన్యము మున్నగు సంపదలను దలఁచుకొని లీలావతితో నిట్లనియెను.

"చేతోహరా యువతయ స్సుహృదోఽనుకూలాః
సద్బాంధవాః ప్రణయగర్భగిరశ్చ భృత్యాః,
వల్గన్తి దన్తినివహా స్తరళా స్తురఙ్గాః"

"భార్యలు మనోహారిణులు; మిత్రులు అనుకూలురు; చుట్టాలు మిగుల మంచివారు; సేవకులు ప్రియముగ మాటాడువారు; ఏనుఁగుగున్నలు లెక్కకు మిక్కిలియై దుముకులాడుచున్నవి. గుఱ్ఱములు కేరుచున్నవి."
తరువాత నాలవపాదము స్ఫురింపక యాలోచించుచుండెను. ఇంతలో నచట నొకమూలనున్న దొంగబాపనయ్య యామూఁడు పాదములను విని తాను వైరాగ్యమును బొందినవాఁడగుట వలన సహింపక నాలవపాదము నిట్లు పూర్తి చేసెను.

"సమ్మీలనే నయనయో ర్నహి కించి దస్తి."
"రెండు కనులు మూఁత పడిన పిదప నేమియు లేదుగదా!"

భోజరాజాశ్లోకపాదమును విని యెంతయు నాశ్చర్యమొందెను. "ఈనిశీథకాలమున నిచట నెవ్వఁడు మనుష్యుఁడు లేఁడుగదా! ఈశ్లోకపాదము నెవరుచెప్పిరి.? ఆకాశవాణి పలికియుండునా ?" అని శయనము నుండి లేచి నాలుగుదిక్కులఁ

బరికించి చూచెను. ఒకమూలఁ గన్నముకడ "నేను బ్రాహ్మణుఁడను; నాతప్పును క్షమియింపవలయును" అని విన్నవించెను.

రా జాతఁడే యాశ్లోకపాదమును రచించె నని తెలిసికొని సంతసించి ప్రసన్నవదనుఁడై తనవస్త్రభూషణాదుల నిచ్చి సంతోషపఱిచి పంపెను.

మఱునాఁడు చినిఁగినప్రాఁతగుడ్డకుసైతము గతిలేని యాబ్రాహ్మణుఁడు దివ్యము లగురత్నాభరణములను బట్టుపీతాంబరములను ధరించి రాజవీథిఁ బోవుచుండెను. ఎల్లవారు నితని సంపన్నవేషమును జూచి యాశ్చర్య మొందుచు నెచ్చటనో దొంగిలించి యుండు నని తలఁచిరి. భోజరాజును రాత్రి తా నతనికి బహుమానము నిచ్చినసమాచారము మఱచి యతనిఁ గనుఁగొని అందఱివలెఁ దాను దలఁచి "ఔరా! ఈ బీదబ్రాహ్మణున కిట్టియమూల్యము లగువస్త్రభూషణాదు లెచ్చటినుండి వచ్చినవి?" అని సంశయ మొంది యాబ్రాహ్మణుని భటులచేఁ బట్టి తెప్పించి "ఓబ్రాహ్మణుఁడా! నీకు నిన్నటిదనుకఁ గట్టుకొనఁ జింపిగుడ్డగూడ లేదు గదా! ఇంతలో నీయమూల్యాభరణము లెచ్చటినుండి వచ్చినవి?" అని యడిగెను.

బ్రాహ్మణుఁడు "అయ్యో! నాబ్రతుకులో నడుగడుగునకు గండమే కదా!" అని యనుకొని యిట్లు వక్కాణించెను.

"భేకైః కోటరశాయిభి ర్మృత మివ క్ష్మాన్తర్గతం కచ్ఛపైః
పాఠీనైః పృథుపఙ్కపీఠలుఠనా ద్యస్మి న్ముహు ర్మూర్ఛితమ్,
తస్మిఞ్ శుష్కసర స్యకాలజలదే నాగత్య తచ్చేష్టితం
యే నాకుంభనిమగ్న వన్యకరిణాం యూథైః పయః పీయతే."



"ఓరాజా! చెఱు వంతయు నెండిపోయినందునఁ గప్పలు రంధ్రములలోఁ జచ్చినట్లు పరుండి యున్నవి. తాఁబేళ్లు మట్టిలోనికిఁ దూరిపోయినవి. చేఁపలు బురదపేటులపై దొరలి దొరలి మూర్ఛ నొందుచున్నవి. ఇట్టి సమయమున నీయెండిన చెఱువులో నకాలమేఘము హఠాత్తుగ వచ్చి వర్షించుట వలన నడవియేనుఁగులు గూడఁ దమ కుంభస్థలముల ముంచుచు నీరు ద్రాగుచున్నవి."

ఈలాగున నాబ్రాహ్మణుఁడు పలుక భోజునకుఁ దాను రాత్రి నతనికి భూషణాదుల బహుమతి నొసఁగిన వృత్తాంతము జ్ఞప్తికి వచ్చెను. పిదప నాబ్రాహ్మణుని గొనియాడి మిగుల సత్కరించి యంపెను.

---

౮

## కాళిదాసు-మూఢగురువు

---

భోజరాజు సభాస్థానములో విష్ణుశర్మ యను పండితుం డొకఁ డుండెను. ఇతఁ డెల్లప్పుడుఁ గాళిదాసునిపై విరోధము సాధించు చుండెను. ఏసమయమునం దేనియుఁ గాళిదాసు నవమానము చేయవలయునని తలఁచుచుండువాఁడు. ఇట్లుండ నొకానొకదినమున నొక మూఢబ్రాహ్మణుఁడు విష్ణుశర్మకడ కేతెంచి

"అయ్యా! నేను మిక్కిలి పేదవాఁడను. ఏవిద్యలుఁగాని యెఱుఁగను. కావున నాకెట్లైన రాజదర్శనముఁ జేయించి నాపేదఱికము వోవునట్లుచేసిన నెంతయు మిమ్ముఁ దలఁచుకొనుచుండెదను. ఇందు కుపాయ మేమో యనుగ్రహమున సెలవిండు" అని దీనుఁడై ప్రార్థించెను.

అతని దీనవచనముల నాలింప విష్ణుశర్మకు మనమున దయారసము గలిగెను. "కాళిదాసున కవమానమును నితనికి ధనమును జేకూర్పఁ జేయ నిదియే సమయము" అని యాలోచించి యొకతంత్రము పన్ని యాబ్రాహ్మణునితో నిట్లనియె. "ఓవిప్రోత్తమా! నీ కేవిద్యయుఁ దెలియదుగావున రాజసభలోఁ బండితులతోడ వాక్యార్థ మొనర్చి గౌరవము నొందుట కల్ల. కావున నేను నీకొకయుక్తి చెప్పెదను. అట్లు చేసెద వేని నీకోరిక సఫల మగును. నీవు చక్కఁగ నెత్తి నంతయు గొఱిగించుకొని సన్న్యాసివేషము ధరింపుము. నీతోడ నలువు రయిదుగురు శిష్యులు వెంటనంటి వచ్చునటులఁ దగినమనుష్యుల నేర్పఱిచెదను. సమయమును గుర్తెఱిఁగి నే నీకు వర్తమానము నంపెదను. అప్పుడు రాజసభకు రావచ్చును. ఊరిలో నిన్నెవ రేని "మీ రెవరు?" అని యడిగిన "కాళిదాసునకు గురువును" అని చెప్పుము. ఇతరము లగు నేసంభాషణములను జేయవలదు. మౌనివై యుండినఁ జూచి పౌరులెల్లరు "ఔరా! మనయూర నుండు కాళిదాసే మహావిద్వాంసుఁడై యున్నాఁడు గదా? అతనిగురు వగు నితఁ డెంతవాఁడొకో!" అని నిన్ను గౌరవించు



దురు. భోజరాజు గూడ నిన్ను విద్యావిషయమై పరీక్షింపక యే బహుమానము చేసి వీడ్కొలుపును." అనియతని మనసు నచ్చునట్లు బోధించెను.

అంత నాపెట్టిబ్రాహ్మణుఁ డాకుయుక్తికి మెచ్చి చంకలు దట్టి సంతోషించుచుఁ బట్టణము వెలుపలి కేగి కాషాయవస్త్రము మున్నగుసన్న్యాసిచిహ్నముల ధరించి పెద్దయోగీశ్వరుఁడువలె విష్ణుశర్మ పంపిన నలుగురుశిష్యులను వెంట నంటించికొని రాజవీధి నొకసారి కడవఱకుఁ బోయివచ్చి నాలుగు వీథులుఁ గలిగియున్న చదుకమునఁ గూర్చుండి యుండెను. వీథిలో వచ్చుచుఁ బోవుచుండు జనులు వింతవింతలుగఁ గనుఁగొనుచు నితఁ డెవఁడని యతనిశిష్యులనడుగ వారు "ఇమ్మహనీయుఁడు కాళిదాసుని గురువు" అని బదులు చెప్పుచు వచ్చిరి.

అంత నీసమాచారము నగరమందంతటఁ దెలిసి "కాళిదాసుగురువా? ఆ!" అని యెల్లరు గుంపులుగుంపులుగఁ గూడి వచ్చి యతనిం జూచి నమస్కరించి పోవుచుండిరి. ఈకపటసన్న్యాసియుఁ గన్నులు మూయుచుఁ దెఱచుచు నోరెత్తక మహామౌనివలె మౌనియై యుండెను. ఆచదుకమునకు సమీపమునందే పండుకొనుట కొక గృహము నేర్పఱచుకొనియెను. ఈసంగతి కాళిదాసునకుఁ దెలిసెను. "ఇయ్యది విష్ణుశర్మ చేసిన యుపాయము కాఁబోలు. కానిమ్ము, చేయఁదగిన పని చేసెదఁగాక" అని యాలోచించెను.

ఇంతలో సన్న్యాసిరాక భోజునికిఁ దెలిసి కాళిదాసుఁ జూచి "కవీశ్వరా! మీగురువుగా రిచ్చటికి వచ్చినారని యంద

అనుకొనుచున్నారు. నీవుకనుఁగొంటివా?" అనియడిగెను. కాళి
దాసు కాలోచితముగ "నేను దర్శనముచేయవలయునని యను
కొనుచున్నాఁడను." అని సమాధానముచెప్పి నాఁటిరేయి నా
కపటసన్యాసిదగ్గఱకేగెను. అతనిశిష్యులు కాళిదాసు నెఱిఁగిన
వారగుటం జేసిగురువుగారనుష్ఠానముమీఁదనున్నారనియు దేవ
తార్చనముఁ జేయుచున్నారనియు నేదియో మిషపెట్టి యతనిఁ
గాళిదాసునకు గనఁబఱుప కుండిరి. కాళిదా సెట్లైనియు నితని
గనుఁగొనవలయునని పట్టుపట్టి కొంతసేపు కాచియుండి యెట్టకే
లకు నతనిఁ గనుఁగొని యిట్లనియె.

"ఓబ్రాహ్మణుఁడా!నీవు కాళిదాసునకు గురువునని చెప్పు
కొనుచు నిచట దొంగవేషము వేసికొని కూర్చుండి యున్నాఁ
డవు. దీనివలన నీకేమి లాభము? ఇట్లుచేసినఁ గాళిదాసువలనఁ
గాని యితరుల వలనఁ గాని భయములేదా?" అనుచు నాతని
కెదురుగఁ గాళిదాసు కూర్చుండెను.

ఆబ్రాహ్మణుఁ డతఁడు కాళిదాసని యెఱిఁగి యేమిచేయు
నో యనుభయమున తత్తఱపడుచు లేచి. చేతులు జోడించి
నమస్కరించి "స్వామీ! నాకేమియుఁ దెలియదు. విష్ణుశర్మ
నాకీవేషమును వేసి యిచటఁ గూర్చుండఁ బెట్టెను. కాఁబట్టి
నాయపరాధమును క్షమింపవలయును. నే నుదరపోషణము
చేసికొనఁ జాలక 'భోజరాజదర్శనముఁ జేయించి యించుక
ద్రవ్యప్రాప్తి గలుగఁజేయుఁడీ!' అని విష్ణుశర్మను వేఁడుకొంటిని.
అతఁ డీయుక్తిఁ బన్నెను. ఇది నిజమైన వృత్తాంతము" అని సవి
నయముగ విన్నవించెను.



ఆబ్రాహ్మణునిదైన్యమునుజూచి కాళిదాసు దయఁదలఁచి
"ఓబ్రాహ్మణుఁడా! ధనము నార్జించుకొనుట కెన్నియుపాయము
లైనను జేయవచ్చును. దానిగుఱించి నాకేమియుఁ గోపము
లేదు.మీవంటిబీదబ్రాహ్మణులకు శక్తికొలఁది ధనప్రాప్తిగలుగఁ
జేయుట మాబోఁటివారికి ముఖ్యకర్తవ్యము. కావున నీకు
ద్రవ్యలాభము గలిగిన నాకుసంతోషమే! నేనంతగ మీకు
ధనసహాయముఁ జేయలేకున్నను నొకమాట చెప్పెద వినుము.
నీవు కాళిదాసునకు గురువని రాజుగారికిఁ దెలిసినది. తప్పక
నిన్నుసభకుఁ బిలిపింపక మానఁడు. అప్పుడు నిన్నేమియు ప్రశ్న
సేయకయే బహుమానించి పంపిన సంతోషమే. అట్లు కాక
యేదేని ప్రశ్ననడిగిన నన్నుఁ జూపుము. నేను తగినసమాధా
నముఁ జెప్పి నీకు మెప్పుఁ దెప్పించెదను" అని పలికి కాళిదాసు
వెడలిపోయెను.

మఱునాఁడు భోజరాజు కాళిదాసు గురువును సగౌరవ
ముగఁ దోడ్కొని వచ్చుటకు పల్లకిఁ బంపెను. గురువును నలు
వురు శిష్యులు వెంటరాఁగాఁ బాలకి నధిష్ఠించిమహావిభవమున
భోజుని సభాస్థానమున కేతెంచెను.

భోజుఁ డెంతయు భక్తిపూర్వకముగ నతని నెదుర్కొని
తోడ్తెచ్చి యుచితాసనమునఁ గూర్చుండఁబెట్టెను. సభలో
"నందఱు కాళిదాసునిగురువా!" అని యత్యాశ్చర్యమున
నోరుఁదెఱచుకొని తలలెత్తి చూచుచుండిరి.

అపుడు భోజరాజు కాళిదాసుఁ జూచి "కాళిదాసా!
మీగురువుగారితోఁ గొంచెము విన్నవింపవలయు నను కోరిక

గలదు” అని యడిగెను. “అట్లే కావచ్చును. అన్నివిషయముల లో వా రతిసమర్థులు” అని కాళిదాసు బదులు చెప్పెను.

భోజరాజు గురువుగారిని జూచి సవినయముగ “మహానుభావా! మీరు సర్వజ్ఞులరు. మీసన్నిధిలో నాచేయుప్రశ్నము కేవల మల్పముగా నున్నను క్షమింపవలయును. లంకాపట్టణాధిపతి యగుదశాననుని పేరగు ‘రావణ’ శబ్దమునకుఁ గొందఱు విశ్రవసునికుమారుఁ డగుటవలన విశ్రవశ్శబ్దమునకుఁ బుత్త్రుఁ డనునర్థమున రవణాదేశమువచ్చి రావణ యనియయ్యెననియు, గొందఱు కైలాసపర్వతము నెత్తినపుడు శివుఁడుబొటనవ్రేలితో నణఁగఁద్రొక్కఁగా నపు డేడ్చెను గాన రావణ యనియయ్యె ననియు నిట్లు రెండు తెఱఁగుల వ్యుత్పత్తిఁ జెప్పెదరు. వీనిలో నేది సరియో సెలవీయఁ బ్రార్థించుచున్నాఁడను” అనియెను.

ఇట్లు భోజరా జడిగిన ప్రశ్నమును విని సభయంతయు మాఱుపలుక కుండెను. భోజరాజు గురుముఖమున నాసంశయమును దీర్చుకొనవలయు నని యేకాగ్రచిత్తుఁడై యుండెను. ఈమూఢబ్రాహ్మణుఁ డేమి చెప్పఁగలఁడు? ఏమియుఁ దోఁపక యూరకుండి “ఆరాభణుఁడా!” అని పలికెను.

అది విని సభవా రందఱు నాశ్చర్య మొందిరి! “స్వామీ రావణుఁ డని కదా యంద ఱందురు. రాభణుఁడెట్లగును?” అని భోజరాజడిగెను. ఆబ్రాహ్మణుఁడు తత్తర మొందియు ధైర్యముఁ దెచ్చుకొని భయవికారములేవియుఁ దెలియనీయక “నాశిష్యుఁడు కాళిదా సున్నాఁడు. వాని నడుగుఁడు” అని చెప్పెను.



తరువాతఁ గాళిదాసు నడుగ నిట్లు వక్కాణించెను.

“భకారః కుమ్భకర్ణే చ భకారశ్చ విభీషణే,
తయో ర్జ్యేష్ఠే కులశ్రేష్ఠే భకారః కిం న విద్యతే?”

“కుంభకర్ణుని పేరునందు భకారము గలదు. అట్లే విభీషణుని పేరునందును భకారముగలదు. ఈయిద్దఱికన్నఁ బెద్దవాఁడగు రావణుని పేరునందు భకార మెందుకు లేదు?”

కాళిదాసు చెప్పిన సమాధానమును విని భోజరాజు సంతోషపడి యాకాళిదాసుగురువును మిక్కిలి గౌరవించి లక్షరూప్యముల నొసఁగి వీడ్కొలిపెను. తరువాతఁ గాళిదాసు చేసినయుపాయమునకు విష్ణుశర్మ యెంతయు లజ్జితుఁడై తల వంచుకొనియెను.

---

# 9
# పతివ్రత.

---

పూర్వకాలపురాజు లిప్పటిరాజులవలెఁ గాక ప్రజలసుఖదుఃఖములను గనుఁగొనుటకు మాఱువేషములుధరించి పట్టణముల నెల్లఁ గలయఁ దిరుగుచు నాయాచోటుల విశేషములను దెలిసికొనుచుండు వాడుక గలదు. కావున నొకనాఁడు భోజరాజు రాత్రికాలమున మాఱువేషము ధరించి పట్టణమునఁ దిరుగుచు నొకబ్రాహ్మణగృహమునకుఁ జేరి పంచమూల నొదిగి యుండి యచట జరుగు చమత్కారమును జూచుచుండెను.

ఆగృహములో భార్యాభర్తలిద్దఱును రెండేండ్లబాలుఁ డొకఁడును ఉండిరి. ఆబ్రాహ్మణుఁడు బీదవాఁ డయ్యును వేదాధ్యయనమును జేసినవాఁడు గావున వైదికవృత్తిచే నాపట్టణమున జీవనము సేయుచు నాచారమార్గమును దప్పక యుండువాఁడు. నిరంతరమును ధార్యాగ్నిహోత్రుఁడు. ఈయన భార్య పరమపతివ్రత. ఇట్లనుకూలదాంపత్యము గలిగి లక్ష్మీనారాయణులవలె పార్వతీపరమేశ్వరులవలెఁ గాపురము సేయుచుండిరి.

ఆదినము పగలంతయు నేదియో కార్యవశమున శ్రమము నొందినవాఁడగుటంజేసి విశ్రాంతికై తనభార్యతొడపై శిరము నుంచుకొని పరుండి నిద్రించెను. సమీపమున నే యగ్నికుండమున నగ్ని ప్రజ్వరిల్లుచుండెను. అతనికుమారుఁడజ్ఞానమునఁ గాలునను భీతిలేక దోఁగాడుచుఁ బోయి పోయి యాయగ్నికుండములోఁ బడియెను. ఆపతివ్రత యాబాలునిఁ జూచుచున్నను దాను లేచినఁ బతికి నిద్రాభంగము గలుగు నని సంశయించి యగ్నిహోత్రుని ధ్యానించుచు నూరక యుండెను. ఆ పాతివ్రత్య ప్రభావమున నించుకయేనియు నగ్నివలన బాధ గలుగక యాబాలుఁడగ్నిలోఁ బడియు నాడుకొనుచుండెను. ఈచిత్రమును భోజరాజు గనుఁగొని యత్యాశ్చర్యము నొంది యాపతివ్రతాతిలకమును మనమున నమస్కరించి గృహముఁ జేరి మఱునాఁడు సభ కేతెంచి యాస్థానకవులతో నిట్లనియెను:—

“హుతాశన శ్చందనపఙ్కశీతలః”

“అగ్ని చందనమువలెఁ జల్లనివాఁడు.”



ఈప్రశ్నమును విని పండితులందఱు ప్రత్యుత్తరమీయఁ జాలక తెల్లమొగము వైచుకొని యుండిరి. అపుడు కాళిదాసు భోజుని యభిప్రాయమును దెలిసికొని తక్కిన మూఁడు పాదముల నిట్లు వచించెను.

“సుతం పతంతం ప్రసమీక్ష్య పావకే
న బోధయామాస పతిం పతివ్రతా,
పతివ్రతాశాపభయేన పీడితో
హుతాశన శ్చన్దనపఙ్కశీతలః ”

“ఒక పతివ్రత కుమారుఁ డగ్నిలోఁ బడుచుండుటఁ గనుఁగొనియు భర్తను నిద్ర లేపక పోయెను. పతివ్రత శపించు నను భయమున నగ్నియుం జందనమువలెఁ జల్లనివాఁ డయ్యెను.”

ఇట్లు కాళిదాసు చెప్పఁగా విని యెల్లరు నాశ్చర్యము నొందిరి. భోజరాజు విస్మితుండై ఆహా ఈచమత్కారము నెన్నఁడైన జూచితిమా? ఆసమయమున నాకన్న నితరుఁ డొక్కఁడేనియు లేడు గదా! ఈమహాకవి కీసమాచార మెట్లు తెలిసెను? ఏదియో యితనికి మంత్రసిద్ధి యుండ నోపు నని యాలోచించి కాళిదాసుని మిగుల గారవించి సభఁ జాలించి యంతఃపురమున కేగెను.

---

# 10

# కాళిదాసు-చేపలు.

---

మహాకవి కాళిదాసు తన కవితాచమత్కారమువలన నిరంతరము భోజరాజును మెప్పించుచు నతఁడర్ధాసన మొసఁగ నతనితో సమానముగఁ గూర్చుండి యుండును.

కాళిదాసున కట్టి మహాగౌరవము గలిగి యుండుట వలన భట్టబాణుఁడు, శంకరుఁడు మున్నగుకవులెల్లరు నతనిపై నసూయ పడి రాజున కతనియందు గల గురుభావమును దొలఁగింపవలయు నని యాలోచించి కాళిదాసుఁడు లేని సమయమున భోజునికడ కేగి "రాజా! కాళిదాసుఁడు వేశ్యాలంపటుఁడై యున్నసమాచార మందఱెఱిఁగినదియే కదా! ఇంతియ కాక బ్రాహ్మణుఁ డయ్యును నించుకయేని సంశయింపక చేఁపలనైతము భక్షించుచున్నాఁడు. ప్రతిదినము నంగడివీథిలో నిలుచుకొని పోవుచుండఁగా మే మందఱమును జూచుచునే యున్నారము. అగ్రజాతి జనించి మహారాజాస్థానమునఁ గవీంద్రుఁడై యుండి చేఁపలఁ దినుట కేవల మధర్మము గదా!" అని చెప్పిరి.

భోజరాజు మనమున నాలోచించి వీరందఱు నతనిపై నసూయచేఁ బలుకుచున్నారని నిశ్చయించియు వారల మనము చిన్నవోవకుండ నాభట్టబాణాదులతో "ఓపండితులారా! కాళిదాసు చేఁపలు దినుననిన నతివిచిత్రముగ నున్నది. నిజ మేని యతఁడు చేఁపలు గొని పోవునపుడు సత్వరముగ నేను రమ్మంటి నని పిలుచుకొనిరండు" అని చెప్పి పంపెను.



వారు తాముచెప్పిన యసత్యములు సత్యము లని నిరూపింపనేరక మఱునాఁడు సభకు రాకుండిరి. కాళిదా సది తెలిసికొని వారియిష్టప్రకారమే చేయుదునని యొకనాఁడు వారందఱు చూచుచుండ గటికయంగడి కేగి చేఁపలను గొని కట్టగఁ గట్టి చంకలోఁ బెట్టుకొని పోవుచుండెను.

బాణభట్టు మున్నగువా రదిచూచి సమయము దొరకెఁ గదాయని సంతసించి యతని కెదురుగ నేఁగి "మిత్రమా! కాళిదాస! నిన్నిప్పుడే భోజరాజు తోడ్కొని రమ్మని సెలవిచ్చినాఁడు. కాఁబట్టి యిట్లే రావలయును" అని చెప్పిరి.

కాళిదాసు దీనుఁడు వోలె భయభ్రాంతుఁడు వోలె వారితో నేతెంచుచు మార్గమధ్యమున నేదియో మిష పెట్టి తప్పించుకొని పోవం జూచి తత్తఱపడువానివలె నటించుచుఁ దుదకు విధిలేక బయలు దేఱినవాఁడువలె భోజసభ కేతెంచెను.

చంకలోఁ బెట్టుకొనిన చేఁపలతోఁకలు పైకిఁ గొంచెముగఁ గనఁబడుచుండెను. ఆచేఁపలనుండి జొటజొట నీటిబొట్లులు పడుచుండెను. అపుడు భోజరాజు కాళిదాసుంజూచి యిట్లనియెను.

భోజరాజు:—‡ నీచంకలో నుంచుకొనినది యేమి?

కాళిదాసు:—పుస్తకము.

భోజ:—నీ రున్నది ఏమి?

---

‡కక్షే కిం తవ? పుస్తకం, కి ముదకం? కావ్యార్థసారోదకం
గంధః కిం? నను రామరావణమహాసంగ్రామరంగోద్భవః,
పుచ్ఛః కిం? నను తాళపత్రలిఖితం, కిం పుస్తకం భో! కవే?
రాజన్! భూమిసురైశ్చ సేవిత మిదం రామాయణం పుస్తకమ్.

కాళి:—కావ్యార్థములలోని సార మీనీరు.
భోజ:—కం పేమి?
కాళి:—రామరావణులయుద్ధమునఁ జచ్చిన పీనుఁగుల కంపు.
భోజ:—తోఁక యేమి?
కాళి:—మొదళ్లు కొనలుఁ దఱుగనిక్రొత్తతాటాకులలో వ్రాయఁబడినది.
భోజ:—ఓ కవీశ్వరా! అ దేమి పుస్తకము?
కాళి:—ఓరాజా! విప్రోత్తము లాదరించు శ్రీరామాయణ పుస్తక మిది.

అని కాళిదాసు వంచింప భోజరా జతని చంకలోని చేఁపల కట్టను విప్పించెను. కాళిదాసుని కాళీమంత్రప్రభావమువలన నయ్యది నిజముగ శ్రీరామాయణగ్రంథమే యయ్యెను. భట్టిబాణుఁడు మున్నగుపండితు లెల్లరు వెలవెలఁ బోయిరి.

తరువాత భోజరాజీపండితులు చేసినకపటకృత్యమునకుఁ గోపించి యిట్టిదుర్మార్గు లగుపండితు లాస్థానమున నుండఁదగరని "ఓ పండితులారా! మీ రెల్లరు నాదేశములో నుండవలదు పొండు" అని యాజ్ఞాపించెను. అప్పుడు పండితులెల్లరు రాజునకుఁ గాళిదాసునకు నమస్కరించి "ఓమహారాజా! మాతప్పును క్షమింపుఁడు మే మేదేశమున కేగినను మీవంటి రాజచంద్రుని జూడఁబోము. వృక్షమును బక్షులు వోలె నిన్నాశ్రయించి యున్నారము మొదటనుండి మమ్ములను బోషించి యిప్పుడు రాజ్యమునుండి వెడలఁ దఱుముట నీకు న్యాయమా? ఎవ్వఁడేనియుఁ జెట్టును నాటి ఫలము పర్యం



తము పెంచి తరువాత దానిఁ దెగనఱక యత్నించునా?" అని యనేకవిధముల మొఱపెట్టుకొనిరి.

కాళిదాసు దయ గలిగి భోజునితో "వారల వెడలఁ గొట్టుట యన్యాయము గానఁ గరుణింపుము" అనిపురుషకార మొనర్చెను.

తరువాత భోజుఁడు "కాళిదాసా! లోకములో నిన్నుఁ బోలుపండితుఁ డెవ్వఁడును లేఁడు. మహాకవి వగునీవు నపకారము సేయఁ దలఁచిన యీకవులను దయఁ దలఁచుటనీసుగుణముల నెంతయు వెల్లడించుచున్నయది" అని యనేకప్రకారముల నుగ్గడించి పండితులఁ దమగృహములకు వీడ్కొలిపెను. పండితులు కాళిదాసునియుపకారమును దలఁచుచుఁ దమ రతనిపై నసూయపడినందుకు రోయుచు నిజగృహముల కేగిరి.

---

## 11
## హేమచంద్రుఁడు.

---

భోజరాజుసభాస్థానమునఁ గాళిదాసు గొప్పవిద్వాంసుఁడును గవియు నై యుండెను. అవంతిదేశవాసి యగు హేమచంద్రుఁ డనునొకకవి శాస్త్రవాద మొనర్చి యెట్టు లేనియుఁ గాళిదాసును జయింపవలయు నని ధారానగరమున కేతెంచి యొకసత్రములో నివసించి యుండెను.

ఇతఁడు మిక్కిలి సంపన్నుఁడు. కాఁబట్టియే పాలకియు మఱియుఁ గొంతపరివారమును వెంట నుండెను. ఇతనికి భోజుని యాస్థానమునుండి కాళిదాసును దొలఁగించి యాయున్నత విద్వత్పదమును దా నాక్రమింపవలయు నను దురుద్దేశము పూర్ణముగఁ గలదు.

ఇట్లు ప్రతిదినమును బాలకి నెక్కి పట్టణము నంతయుఁ గలయఁ దిరుగుచు నచ్చటచ్చట నేవేనివిశేషములఁ గనిపెట్టుచుండెను. ఈసమాచారమును గాళిదాసెఱిఁగి యితని విద్యావైదుష్య మెంతటిదో తెలిసికొని యుక్తిచే నవమానింపవలయు నని తలఁచి తాను బోయవేషమును వేసికొని హేమచంద్రుని పాలకిమోయు బోయలలోఁ గలసి వర్తించుచుండెను.

ఒకనాఁడు హేమచంద్రుఁ డతిత్వరితముగ నెచ్చటికో యేఁగఁదలఁచి పాలకి బోయలను గుఱించి "ఓరీ! ఎవఁడు రా అక్కడ?" అని పిలిచెను. అపుడు కాళిదా సేతెంచి "మహాప్రభూ! ఏమి సెలవు!" అని యడిగెను. "ఓరీ! దూరప్రయాణము సేయవలెను. బోయలందఱు సిద్ధముగ నున్నారు కదా!" యనిపలికెను. కాళిదాసు సంతసించి, "అయ్యా! బోయలందఱు సిద్ధముగ నున్నారు. దేవరవారు దయసేయుటయే యాలస్యము" అనియెను.

తరువాత హేమచంద్రుఁడు మిగుల నభిమానమును వెల్లడించుచుఁ బాలకి నధిష్ఠించి ప్రయాణ మయ్యెను. పాలకి ముందఱిబొంగును కాళిదాసునుమఱియొకబోయయు, వెనుకటి



బొంగును మఱియిద్దఱు బోయలు మోచుకొని పోవుచుండిరి. ఇట్లు కొంతదూరముపోఁగాఁ గాళిదాసు శ్రమమొందినట్లుకనుఁగొని హేమచంద్రుఁ డతనిఁ జూచి యి ట్లనియెను.

"అయ మాన్దోలికాదణ్డః స్కంధం కిం తవ బాధతి?"

"ఓ బోయవాఁడా! ఈపల్లకి బొంగు నీకు బాధ గలిగించుచున్నదా యేమి?"

ఈశ్లోకార్థమునందు హేమచంద్రుఁడు వ్యాకరణవిరుద్ధముగ 'బాధతే' అనఁదగినచోట 'బాధతి' అని తప్పు ప్రయోగము సేసెను గానఁ గాళిదాసు విని సహింపక యి ట్లనియెను.

"న బాధతే తథా మాం హి యథా బాధతి బాధతే"

"అయ్యా! నీవు వ్యాకరణమునకు విరుద్ధముగఁ బ్రయోగించిన బాధతి యనుపదము బాధించునట్లు ఈపాలకిబొంగు బాధించుట లేదు."

అది విని హేమచంద్రుఁ డత్యాశ్చర్యమునొంది "ఔరా! పాలకి మోయువారిలో నింతటిపండితుఁ డుండుట గలదా?" అని యచ్చెరువొంది "ఓరీ! ఇట్టిసంస్కృత భాషాజ్ఞానము నీకెట్లు గలిగినది" అని యడిగెను. "అయ్యా! తమవంటిపండితుల సేవవలన లభించినది." అని చెప్పెను. హేమచంద్రుఁడు "ఆపండితుఁడెవఁ"డని యడిగెను. "అయ్యా! ఈపట్టణములోఁ గాళిదాసుఁడనువిద్వాంసుఁడుగలఁడు. నే నాపండితునిపాలకి మోయువాఁడను. కావున వారు శిష్యుల కప్పుడప్పుడు చెప్పుమాటల విని విని యేదో కొంచెము సంస్కృతజ్ఞానము గలిగినది. కాళి

దాసు పాండిత్య మింత యని చెప్ప నెవ్వరితరము?" అని కాళి
దా సనియెను.

హేమచంద్రుఁ డామాటలు విని కాళిదాసు పాలకి
మోయువాఁ డింతటిపండితుఁ డేని కాళిదాసువిషయము వేఱ
యడుగ నేల? ఇట్టి మహావిద్వాంసునిఁ బరాభవింప మార్గ మేది
గలదు? కోటిధనము నేని వ్యయము సేసి యతని నేయుపాయ
మున నైనను భోజరాజు నాస్థానమునుండి తొలఁగింపవల
యును" అని యాలోచించి మఱునాఁడు కాళిదాసునిగృహమున
కేగఁ దలఁచెను.

ఇంతలోఁ గాళిదాసు హేమచంద్రుఁడు దనగృహమున
కేతెంచు నని తెలిసికొని దాసీవేషమును ధరించి గృహద్వార
మున నిలుచుండి యుండెను. హేమచంద్రుఁడేతెంచి యాదాసీ
రూపమున నున్న కాళిదాసుతో "ఓదాసీ! కాళిదా సెక్కడ
నున్నాఁడు?" యని యడిగెను. దాసి యిట్లుత్తర మిచ్చెను.

"నఖలీనఖలీనలీలయా నమయా న్నన్నమయ న్నవం హయామ్,
నిరగా దురగారిరంహసా పురగారుత్మతగోపురా ద్బహిః."

"(కాళిదాసు) క్రొత్తగుఱ్ఱము నెక్కి కళ్లెమును విలాస
ముగ లాగుచు వదలుచు గరుత్మంతునింబోలు వేగమున గరుడ
పచ్చలగోపురమునుండి పట్టణము వెలుపలికిఁ గ్రీడార్థమై పోయి
యున్నాఁడు."

దాసి వాక్యముల విని హేమచంద్రుఁడు "కాళిదాసుని
వైదుష్య మతని సకలపరివారమునందును వ్యాపించి తేజరిల్లు
చున్నదిగదా" అని యచ్చెరువంది "ఓదాసీ! నీవు కాళిదాసుని



దాసినని చెప్పుచున్నావు. నీశరీరమున భూషణ మొక్కఁడేనియు
లేకున్నయది కారణ మేమి?" అని హేమచంద్రుఁ డడిగెను.
దానికిఁ బ్రత్యుత్తర మిట్లు వక్కాణించెను.

"హస్తస్య భూషణం దానం సత్యం కంఠస్య భూషణమ్,
శ్రోత్రస్య భూషణం శాస్త్రం భూషణైః కిం ప్రయోజనమ్?"

"హస్తమునకు భూషణము దానము. కంఠమునకు భూ
షణము సత్యభాషణము. చెవులకు భూషణము శాస్త్రము.
తక్కిన భూషణములవలన నేమి ప్రయోజనము?

ఆదాసీపలుకులు విని హేమచంద్రుఁడు "ఓదాసీ! నీకిట్టి
వైదుష్య మెట్లుగలిగె? నీ వేదేవుని పూజించెదవు?" అని యడి
గెను. వెంటనే దాసి యిట్లుత్తర మిచ్చెను.

"విహంగో వాహనం యస్య త్రికచా యత్ర భూషణమ్,
సాలపా వామభాగేచ తేదేవా శ్శరణం మమ?"

"(వి) గరుత్మంతుఁడును, (హం)హంసయు,(గో) ఎద్దును
నెవరివాహనములో, (త్రి) త్రిశూలము, (క) కమండలువు,
(చా) చాపము నెవరికి భూషణములో, (సా) సావిత్రియు, (ల)
లక్ష్మియు, (పా) పార్వతియు నెవ్వరి యెడమవైపున భార్యలై
యుందురో, ఆదేవతలు నాకు రక్షకులు."

ఈయద్భుతశ్లోకమునువిని హేమచంద్రుఁడు "ఈదాసికే
యిట్టి వైదుష్యముగలిగియున్నఁ గాళిదా సెంతటివాఁ డనఁ
దగును? దీనిని జయించుటయే దుస్తరముగఁ దోఁచుచున్నది.
కావున నిఁక నాప్రయత్నమును జాలించుకొని యూరక యుం

డుటయే యుత్తమము" అని తలఁచి యెరికిఁ దెలియకుండ వచ్చిన త్రోవనే వెడలి పాఱిపోయెను.

## 12

## త్రిపీడాస్తు దినేదినే.

ఒకనాఁడు భోజరాజు సకలవిద్వద్బృందము సేవించియుండఁ గొలువుదీరియుండెను. అట్టిసమయమున నొకబీదబ్రాహ్మణుఁ డేతెంచి రాజునకు నాశీర్వచనము చేయునపుడు 'త్రిపీడాపరిహారోఽస్తు' అని పెద్దలు వచించు దీవనపు వాక్యమును మఱచి సంస్కృతజ్ఞాన మించుకేనియు లేనివాఁ డగుటంజేసి తాఱుమాఱుగా 'త్రిపీడాఽస్తు దినేదినే' అని దీవించెను.

భోజరాజాయశుభవాక్యమును విని మిక్కిలి కోపోద్దీపితమానసుఁడై భటునిఁబిలిచి 'ఓరీ! యీబ్రాహ్మణుని నగరము వెడల నడువుము' అని యాజ్ఞాపించెను. ఇంతలోఁ గాళిదాసుఁడాబ్రాహ్మణుఁడు మూఢుఁ డని తెలిసికొని దయదలఁచి యీబీదబ్రాహ్మణున కెట్లేని యుపకారము సేయుద మని యెంచి 'ఓమహారాజా! మీరుపొరపాటుపడినారు. ఆబ్రాహ్మణుఁడు మహావిద్వాంసుఁడు. కావుననే యిట్టిగంభీరోక్తిచే నాశీర్వచన మొనర్చినాఁడు. మీరాకవియభిప్రాయమును గనుఁగొననేరక పైన నతని వెడలనడుచుట యెంతయు నన్యాయము' అనియెను. భోజుఁడు 'కవివరా! ఆకవియభిప్రాయము వేఱనికదా మీ రెంచితిరి? అట్లేని మీరు



వచింపుఁడు' అని పలికెను. కాళిదాసీలాగున నాశ్లోకమును జెప్పెను.

"ప్రదానే విప్రపీడాస్తు పుత్రపీడాఽస్తు భోజనే,
శయనే దారపీడాఽస్తు త్రిపీడాఽస్తు దినేదినే."

"దానమిచ్చుసమయమున 'ఈబ్రాహ్మణున కేమియిచ్చినఁ దీఱునా?' అనుదుఃఖము గలుగుఁగాక. భోజనము సేయునపుడు 'పుత్త్రుల నెట్లు సంతోషపెట్టుదునా?' అనుదుఃఖము గలుగుఁగాక. శయనించుసమయమున 'ఈరాత్రి నాప్రియురాలి నేవిలాసములఁ గరగింతునా?' అనివిచారము గలుగుఁగాక. ఈమూఁడు దుఃఖములు ప్రతిదినమును నీకుఁ గలుగుఁ గాక."

కాళిదాసుని శ్లోకమును విని సభ్యులెల్లరు మిక్కిలి యాశ్చర్యమునొందిరి. భోజుఁడు మిగులసంతసించి యాబ్రాహ్మణుని గౌరవించి వీడ్కొల్పెను.

## 13

## విలోచనకవికుటుంబము.

ఒకనాఁడు కాశీదేశమునుండి విలోచనుఁ డనుకవి తన భార్యయుఁ గుమారుఁడును గోడలు వెంటరాఁగ భోజుని సభాస్థానమున కేతెంచెను. భోజరాజు వారింగాంచి ముఖతేజమును బట్టి గొప్పవిద్వాంసులుగా నెఱిఁగి యొక సమస్యనిచ్చెను.

"క్రియాసిద్ధిస్సత్త్వే భవతి మహతాం నోపకరణే"

"గొప్పవారికిఁ గార్యసిద్ధి వారి ప్రభావమువలనఁ గలుగుఁగాని యుపకరణములవలనఁ గలుగనేరదు."

ఈసమస్యను విని మహావిద్వాంసుఁ డగునావృద్ధబ్రాహ్మణుఁ డాసమస్య నిట్లు పూర్తిచేసెను.

"ఘటో జన్మస్థానం మృగపరిజనో భూర్జవసనో
వనేవాసః కందాదిక మశనదేవంవిధగుణః,
అగస్త్యః పాథోధిం యదకృత కరాంభోజకుహరే
క్రియాసిద్ధి స్సత్త్వే భవతి మహతాం నోపకరణే."

"అగస్త్యునకుఁ బుట్టినిల్లు కుండ. మృగములు పరివారము. భుజపత్త్రిరి వస్త్రము. అడవియందు నివాసము. కందగడ్డలుమున్నగునవి యాహారము. ఇట్టి గుణములు గలవాఁ డయ్యును సముద్రమును బద్మమువంటి తనయఱచేతిలో నుంచుకొనెను. కావున మహాత్ములకుఁ గార్యసిద్ధి తమ ప్రభావమందే యుండునుగాని సాధనమందు లేదు."

ఈసమస్యాపూరణమును విని భోజరాజత్యంతప్రసన్నుఁ డయ్యెను. ఆబ్రాహ్మణునకుఁ బ్రీతిపూర్వకముగ మిక్కిలి వెలగల యొకరత్నమును బహుమతి చేసెను.

తరువాతనావృద్ధబ్రాహ్మణునివెంబడిలక్ష్మివలె నిలువఁబడి యున్న యతనిభార్యం గనుఁగొని భోజరాజు "అమ్మా! నీకు దోఁచినరీతి నదేసమస్యను బూర్తిచేయఁ గలుగుదువా?" అని యడుగ నామె యిట్లు వక్కాణించెను.

"రథస్యైకం చక్రం భుజగయమితా స్సప్త తురగా
నిరాలమ్బో మార్గశ్చరణవికల స్సారథి రపి,



రవి ర్యాత్యేవాన్తం ప్రతిదిన మపారస్య నభసః
క్రియాసిద్ధి స్సత్త్వే భవతి మహతాం నోపకరణే."

"సూర్యునిరథమున నొకటియే చక్రము. గుఱ్ఱము లేడును బాములచేఁ గట్టఁబడినవి. దారియా! కాలూన నాధారము లేని యాకాశము. సారథి కాళ్లు లేనియనూరుఁడు. ఇట్టివాఁ డయ్యును సూర్యుఁడు ప్రతిదినము నపారమగు నాకాశపుఁ జివరకుఁ బోవుచు వచ్చుచున్నాఁడు. కాన మహాత్ములకార్యసిద్ధి ప్రభావమునందేకాని సాధనమునందు లేదు." భోజరాజు సంతుష్టుఁ డై పండ్రెండురత్నముల నొసంగెను. తరువాత నావిప్రకుమారుఁ జూచి 'ఓ బాబూ! నీకుఁ దోఁచినరీతి సమస్యం బూరింపు' మన నతఁ డిట్లు పఠించెను.

"విజేతవ్యా లంకా చరణతరణీయో జలనిధిః
విపక్షః పౌలస్త్యో రణభువి సహాయాశ్చ కపయః,
పదాతి ర్మర్త్యోఽసౌ సకలమవధీ ద్రాక్షసకులం
క్రియాసిద్ధి స్సత్త్వే భవతి మహతాం నోపకరణే."

"లంకాపట్టణము జయింపవలసి యున్నది. సముద్రము గాలినడకతో దాఁట వలయును. యుద్ధభూమిలోనిశత్రువు పులస్త్యబ్రహ్మకు మనుమఁడగు రావణాసురుఁడు. తనకు సహాయులుకోఁతులు; తాను పాదచారియగుమనుష్యుఁడు. అయినను శ్రీరామచంద్రుఁడు సకలరాక్షససమూహమును జంపి వేసెను గదా! కావున మహాత్ములకుఁ గార్యసిద్ధిప్రభావమునందేకానిసాధనమునందు లేదు." భోజరాజు మిక్కిలి సంతసించి పదునాఱేనుఁగులనొసంగెను. పిదప నావిప్రకుమారుని సమీపమున నా

కారమునొందిన శృంగారరసమో యన భూలోకమున కవతీర్ణ యగుసరస్వతియో యన నతికోమలాంగియు నతి సుందరియు నగునావిప్రుని కోడలింగాంచి నమస్కరించి 'అమ్మా ! నీవొక యాశీర్వచనమును బలింపవమ్మా' యనియెను. ఆమె నాపై సమస్యను శృంగారరసబంధురముగఁ బూరణ మొనర్చెను.

"ధనుః పౌష్పం మౌర్వీ మధుకరమయీ చంచలదృశాం
దృశాం కోణో బాణ స్సుహృదపి జడాత్మా హిమకరః,
స్వయంచైకోఽనఙ్గః సకలభువనం వ్యాకులయతి
క్రియాసిద్ధి స్సత్త్వే భవతి మహతాం నోపకరణే."

"మన్మథునకు ధనుస్సు పువ్వులు. నారి తుమ్మెదలు. చంచల నేత్రములుగల స్త్రీలకటాక్షములే బాణములు. స్నేహితుఁడు కేవల జడస్వరూపుఁ డగుచంద్రుఁడు. తా నొకఁడు ఆపైని శరీరశూన్యుఁడు. ఇట్టివాఁ డయ్యును సమస్తప్రపంచము నునాకులపెట్టుచున్నాఁడు. కాఁబట్టి కార్యసిద్ధి ప్రభావమునందే కాని సాధనమునందు లేదు."

ఇట్టి యపూర్వకవితావిలాసముఁ గనుఁగొని విద్వత్కవి మండలమంతయు నచ్చెరువొందెను. భోజరాజు మహానంద కందళితహృదయుఁడై లీలావతీదేవి యమూల్యములగు రత్నాభరణముల నొసంగి మిక్కిలి గారవించి యావిద్వత్కుటుంబమును వీడ్కొలిపెను.

---

# 14
# మాణిభద్రుఁడు—సుశర్మ

కాళిదాసు భోజుని సభాసమయమునం దక్క నితరకాలములయం దెల్లపుడుఁ గాంచనమాలయం దనురక్తుఁడై దాని యింటియందే నివసించుచుండెను. ఈ వృత్తాంతము భోజరాజు తెలిసికొని కాళిదాసునందుఁ గొంచెమసూయగలవాఁడు వోలె వర్తించుచుండెను. ఈసమాచారము సీతయను నొకయాస్థానవిద్వాంసురాలు తెలిసికొని యిట్లనియెను.

"దోష మపి గుణవతిజనే దృష్ట్వాగుణరాగిణో నభిద్యన్తే,
ప్రీత్యైవ శశిని పతితం పశ్యతి లోకః కళంక మపి."

"గుణవంతుఁ డగు జనునియందు దోషమునుగాంచియు గుణములయం దనురాగము గలవారుమాత్రము బెడిసిపోరు. చంద్రునియందలి మచ్చనుగూడ లోకులు సంతోషముతోడనే చూచుచున్నారు గదా!" ఈశ్లోకాభిప్రాయమును భోజరాజు గనుఁగొని సైతము పూర్వమువలెఁ గాళిదాసును గౌరవింపక యుండెను. ఇట్లు తనకన్నఁ దక్కువపండితుల గౌరవించుటయు, దన్ను వారితో సాటిగనైనను గౌరవింపకుండుటయు, గాళిదాసురూఢిగఁ దెలిసికొని త్రాసునెపము వెట్టి యిట్లు వక్కాణించెను.

"ప్రాప్య ప్రమాణ పదవీం కోనామాఽస్తేతులేఽవలేపస్తే,
నయసి గరిష్ఠ మధస్తా ల్లఘుతర ముచ్చైస్తరాం కుగుషే."

"ఓత్రాసా! మానము (తూనికె - యోగ్యత) నిర్ణయించు నధికారము కలదు గదా యని నీకెందు కీగర్వము? గౌరవము (బరువు-పూజ్యత) గల దానిని గ్రిందికి బంపుచున్నావు. (అగౌరవము సేయుచున్నావు) లఘువైన దానిని (తేలికయగు వస్తువును - కొద్దివారిని) మిక్కిలి యెత్తుగా నుంచుచున్నావు. (గౌరవించుచున్నావు.)"

"ఓరాజా! మహాకవి నగు నన్నుఁ దిరస్కరించి కొద్ది కవులఁ బూజించుచున్నావు 'నీవు మాయందలి తారతమ్య మెఱుఁగఁజాలవు"అను నభిప్రాయము దోఁచునట్లు వచించి 'మహాకవి నగు నేనెచ్చటి కేగినను గౌరవము జరుగఁగలదు. ఇతఁడగౌరవము సేయుచున్నను నీ దేశమునందుండి దుఃఖపడుట యేల? అన్ని దేశములఁ దిరుగ శక్తిగల నాకీ స్వదేశానురాగమేమి? తండ్రి త్రవ్వించిన బావి యని యుప్పునీటి నెవ్వరైన ద్రాగుదురా! ఇఁక నిచ్చట నుండఁగూడ' దని తలంచి కాళిదాసు నిజగృహమున కేగెను.అదిమొదలు కాళిదాసు భోజుని సభాస్థానమునకురాకయుండెను.తరువాతఁ గాళిదాసుఁడులేమి భోజునిసభ శూన్యగృహమువలె ప్రకాశింపకుండెను. కవితావిలాసము తగ్గిపోయెను. సమస్యాపూరణము మనోహరముగ నొనర్పు విద్వత్కవియే కరవయ్యెను. బాణభట్టాదులు కొంద ఱున్నను గాళిదాసునకు దీటగుదురా? ఇట్టిసమయమున ధారానగరముననొకచిత్రచరిత్రము జరిగెను.

ధారాపట్టణమున నొకబ్రాహ్మణునకు మాణిభద్రుఁడు, సుశర్మ అను నిద్దఱు కుమారులుండిరి. వీరికి యుక్తసమయమున



నుపనయనాది సంస్కారము లొనర్చి విద్యాభ్యాసమునకై కాశికిఁ బంపెను. వీరిలో మాణిభద్రుఁడు ప్రాతఃకాలముననే నిద్ర లేచి స్నానసంధ్యాద్యనుష్ఠానములఁదీర్చుకొని యాచార్యునకు నమస్కరించి నియమముతోడ గురువునొద్ద విద్యాభ్యాసము సేయుచుండెను. సుశర్మ నియమములన్నియు విరుద్ధములుగనే యుండెను. ప్రాతఃకాలమున సూర్యోదయమయిన పిదప నిద్ర లేచుచు స్నానాదికృత్యముల నొనర్పకయే పాఠముఁ బఠించుచు వచ్చెను.

ఇట్లు కొన్నిదినములు గడువ నుభయులు సకలశాస్త్రములయందుఁ బ్రవీణులైరి. ఐనను మాణిభద్రుని విద్యావైశద్యమును తేజస్సును సుశర్మకు లేకుండెను.

ఒకనాఁడు మాణిభద్రసుశర్మలు గురువునొద్దకుఁ బోయి నమస్కరించి 'స్వామీ! మేము తమసన్నిధి కేతెంచి బహుదినములయ్యెను. తమకృపాకటాక్షమువలన శాస్త్రజ్ఞానము లభించినది. కావున మాస్వదేశమున కేగ ననుజ్ఞ యొసఁగఁగదే' యని ప్రార్థించిరి. తరువాత గురువు సంతసించి వారి కాశీర్వచన మొనర్చి జాగరూకులై పొండని యానతిచ్చెను.

నాఁటిదినము మధ్యాహ్నమే కాశినుండి బయలుదేరి సాయంకాలమున నొక గ్రామముఁ జేరి యారాత్రి యొకబ్రాహ్మణగృహమున శయనించి మఱునాఁడు కావలసిన బియ్యము పప్పు మున్నగు భోజనపదార్థములు విలుచుకొని మూటఁగట్టికొని ప్రయాణమైరి. కొంతదూర మేగ నరణ్యమధ్యమున

నొక్కచో నిర్మలోదకములఁ బ్రవహించునదియును పెద్దవృక్షములును జదరపు నేలయును జూడఁ జూడ మనోహరముగ నుండెను. అది చూచి యప్పటికి మధ్యాహ్నకాలమైనందున నచ్చటనే యన్నమువండికొని భుజించి యావలఁ బోవచ్చునని తలఁచి యొక వటవృక్షమునీడను దిగిరి.

తరువాత సుశర్మ మాణిభద్రుని జూచి 'అన్నా! మనమిచట స్నానమొనర్చిన పిదప నేమిసేయవలయును?' అనియెను. 'చక్కఁగా భోజనమొనర్చి యావల మార్గమునుబోవుద' మని మాణిభద్రుఁడు చెప్పెను. తరువాత నిద్దఱు నదిలోన దిగి స్నానమొనర్చిన పిదప సుశర్మ 'అన్నా! మనకుఁ గావలసినభోజనపదార్థము లన్నియు నున్నవి: గాని నిప్పెక్కడనుండివచ్చును' అని యడిగెను. మాణిభద్రుఁడు 'తమ్ముఁడా! నీవు సానుగ్రినంతయు సిద్ధముసేయుము. అగ్ని కేమి నిమిషములో నేనగ్నిఁబుట్టించెద' నని చెప్పి యొక మహామంత్రమును నియమయుక్తుఁడై పఠించెను. తత్క్షణంబున నగ్ని జ్వాలాస్వరూపుఁడై యావిర్భవించెను.

ఈవిచిత్రమును సుశర్మ చూచి యత్యాశ్చర్యము నొంది 'మేమిద్దఱము నొక యాచార్యునియొద్దనే విద్యాభ్యాసముచేసితిమి గదా! నాకేమంత్రమును సిద్ధింపలేదు. ఇతనికి మంత్రము లన్నియుఁ జక్కగా సిద్ధించినవి. మే మిద్దఱము నింటి కేగిన పిదప మాణిభద్రుని విద్యయే జగత్ప్రఖ్యాత మై ప్రకాశించును గాని నావిద్య ప్రకాశింపనేరదు. కావున నితని నిక్కడనే చంపి వైచి గృహమున కేగవలయు' నని తలఁచెను.



తరువాత నిద్దఱు భోజనముఁ జేసిరి. బహుదూరమునుండి వచ్చుచున్నవా రగుటవలన మార్గాయాసముఁ దీర్చుకొనుటకై మాణిభద్రుఁ డించుక నిద్రించెను. సుశర్మ 'ఇదియే నితనిఁ జంపుటకు సమయము' అని తలఁచి గాఢనిద్రయందుండు మాణిభద్రుని ఱొమ్ముపై నెక్కి కూర్చుండెను.

మాణిభద్రుఁడు నిద్రలేచి తనఱొమ్ముమీఁద ఖడ్గము నెత్తి చంపుటకు నుద్యుక్తుఁడై యున్న తమ్ముని జూచి భయమొంది 'అయ్యో! అయ్యో!!' యని పెద్దగ నఱచెను.

ఆయరణ్యములో నతని హాహాకారముల విని రక్షించువారెవరు గలరు? సుశర్మ యతికఠినహృదయుఁడును వేయి బ్రహ్మహత్యల కేనియు వెఱవని పరమపాపాత్ముఁ డగుటం జేసి యెట్లైన నితని జంపవలయు నని దృఢనిశ్చయముతో నున్నవాఁ డగుట వలన నతనిఁ గరుణింపక యూరకుండెను.

అపుడు మాణిభద్రుఁ డత్యంతదీనస్వరమున "తమ్ముఁడా! నీకు నేనేమియు నపకారముసేసిన వాఁడు గాను. మన మిద్దఱము చిన్ననాఁటనుండియు నెప్పుడు నెడఁబాయక యత్యంతస్నేహమున విద్యాభ్యాసమొనర్చి విద్యాప్రవీణుల మై మనతల్లిదండ్రులు చూచి సంతసించునట్లు మన యింటికిఁ బోవుచున్నారము. నే నిచట శయనించునంతవఱకు నాపై నేమియు విరోధభావమును గనఁబఱచినవాఁడవు గావు. ఇంతలో సోదరుని జంపుమని యెవ రుపదేశించిరి? ఈయరణ్యములో నిచట నెవ్వఁడు లేఁడుగదా? ఈబుద్ధి నీకే తోఁచెఁ గాబోలు! అయ్యో! నాజీవి

తము నేఁటితో సరి గదా! 'నీకు సోదరునివలన నరణ్యమధ్యములోఁ జావు గలుగుఁగాక' అని బ్రహ్మదేవుఁడు నాలలాటమున మూఁడుబంతులుగ వ్రాసెఁ గాబోలు." అని యనేకవిధములఁ బ్రలాపించినను పాషాణహృదయుఁ డగు సుశర్మ నిర్దయుఁడై యొమ్మునుండి దిగకుండెను.

అది చూచి 'ఇఁకఁ దప్పక నాకుఁ జావు గలుగును' అని నిశ్చయించుకొని 'తమ్ముఁడా! నన్నుఁ జంపి వేసినంతన నీకు లాభము గలుగు నేని యట్లే చేయుము. నేను నాలుగక్షరములను వ్రాసియిచ్చెదను. ఆపత్రమును మనతండ్రిచేతి కిమ్ము' అని చెప్పెను. సుశర్మ యందుకు సమ్మతింప నొకయాకునందు 'అ ప్ర శి ఖ' అని వ్రాసి యతనిచేతి కిచ్చెను.

తరువాత సుశర్మ మాణిభద్రునికంఠముపైఁ గుడికాలుఁ బెట్టి బిట్టుగఁ ద్రొక్కి రెండవకాలితో రొమ్ము నదిమి పట్టి యొకచేతితోఁ జుట్టు బట్టుకొని చురకత్తితోఁ బలుకుత్తుకఁ గంఠము దెగఁ గోసెను. తక్షణంబ మాణిభద్రుఁడు 'హా! శ్రీహరీ!' యనుచుఁ బ్రాణములు విడిచెను.

కటకటా! సుశర్మ యెంత పాపిష్ఠుఁడు? ఇట్టితమ్ములున్ననేమి చచ్చిన నేమి? సోదరులు పరస్పరము హితపరులై యొకరికిఁ గష్టము వచ్చినఁ దనకువచ్చినట్లుదలఁచి యాకష్టమును నివర్తింపఁజేయఁగలవారు గదా లోకమునకు దైవమునకుఁ బ్రియు లగుదురు. సుశర్మవంటివారేని వారికై బ్రహ్మ మరల నొకనరకలోకమును నిర్మింపకున్న మహారౌరవాదినరకములు వారికెట్లుచాలును?



అంత సుశర్మ యా 'య ప్ర శి ఖ' పత్రమును గైకొని యతిసంతోషమున గృహమునకేతెంచి తలిదండ్రులకు నమస్కరించెను. వారు కుమారుఁడు చాలదినములకు గృహమునకువచ్చెనని యత్యంతప్రేమమునఁ గౌఁగిలించి మూర్ధాఘ్రాణము సేసి "నాయనా! సుఖముగ వచ్చితివా" అనికుశలప్రశ్నచేసి "మాణిభద్రుఁ డేఁడీ?" యనియడిగిరి. సుశర్మ యావృత్తాంతమును గప్పిపుచ్చుచు, "నాయనా! వాఁడెన్నిదినములు చదివినను నొకశాస్త్రమేనియు బూర్తిగా లేదు. కావున నింకను జదువుచున్నాఁడు. నేను గురువు చెప్పినదంతయు నిమిషములో గ్రహించి యన్నిశాస్త్రములయందు నేర్పరి నై వచ్చినాఁడను. ఇంకను మాణిభద్రుఁడువచ్చుట కొకసంవత్సర మేనియుఁ బట్టును" అని చెప్పి యతఁడు వ్రాసియిచ్చిన యా 'య ప్ర శి ఖ' పత్రమును దండ్రిచేతి కిచ్చెను.

అతఁడు చదువుకొనెను; గానియొకయక్షరమునకేనియు నర్థము దెలియక పోయెను. అచ్చట నుండుగొప్పగొప్పవిద్వాంసులు గూడ నర్థము చెప్పలేక పోయిరి.

తరువాత మాణిభద్రునితండ్రి భోజునిసభలోఁ గాళిదాసాది మహావిద్వాంసు లుందురు గదా యని యచ్చటికేతెంచి భోజరాజున కాశీర్వచనము చేసి యా 'య ప్ర శి ఖ' పత్రమును గనఁబఱచెను. అచటఁ గాళిదాసుమాత్రము లేకుండెను, భట్టిబాణాదులెల్ల రుండిరి. భోజరా జాపత్రము నాకవులచేతికిచ్చి 'కవులారా! యీనాలుగక్షరముల కర్థమేమి' అని యడిగెను. పండితులెల్లరేమియుఁ జెప్పనేరక తెల్లబోయియూరకయుండిరి.

భోజుఁడు మిక్కిలి కోపించి 'ఓకవులారా! నాయాస్థాన
మున నిందఱు పండితులుండియు నాలుగక్షరములకర్థము జెప్ప
లేకున్నారు. లోకమం దంతట నిది తెలిసిన గొప్పయపకీర్తి వ్యా
పించును. కావున మీరెల్లని మాసము దినములలో నైనను
దీని కర్థముఁజెప్పిన నెంతయు సంతసము. కాదేని యవ్వల
మీకెల్లరకు మృత్యువే శరణముగాఁగలదు. ఇయ్యదినిశ్చయము'
అని కఠినముగ నాజ్ఞాపించెను.

తరువాతఁ బండితు లెల్లరు నత్యంతభీతులై సభముగి
సిన పిదపఁ దమతను యిండ్లకేగిరి; కాని వీరా నాలుగక్షర
ముల కేమని యర్థము చెప్పఁగలరు? అందఱు నొక్కచోఁ జేరి
యెన్నియోవిధముల నాలోచన సేసిరి; గాని యొక్కనికేనియు
నర్థము స్ఫురింపక పోయెను. ఇట్లిరువదితొమ్మిది దినములుగడ
చెను. ఇంకనొక్కదినములోఁ జెప్పకున్న మఱునాఁడు తప్పక
రాజదండనము సిద్ధముగజరుగును కావునఁ గవులెల్లరు బ్రాణ
ములపై నాశ వదలి దుఃఖసముద్రములో మునిఁగి యుండిరి.

ఇట్లుండ నాఁటిదిన మొక పండితపుత్రుఁ డింటిలో నెవరి
తోనో పోట్లాడి యలిగి యాయూరి ప్రక్కనుండు తన మేన
మామ యూరికిఁ బోవుచుండెను. మార్గమధ్యముననే ప్రొద్దు
గూఁకిచీఁకటిపడియెను. ఆయంధకారములోఁ బోవుటకు భయ
పడి యొక్కచోఁ బెద్ద మఱిచెట్టుండ దానివిశాల మగుస్కంధ
భాగమున నెక్కి కూర్చుండెను.

ఆవృక్షముపైఁ బ్రతిదినమును బేతాళుఁడు సకలపిశాచ
భూతములు సేవింపఁ గొలువుదీరి లోకములోని సమాచారముల



విచారించుచుండును. ఆనాఁడు గూడ ముందుగ నొకపిశాచ
మేతెంచి చదరపుఁ గొమ్మలపై యాసనముల నెల్లఁ జక్క పఱిచి
పోయెను.

పిదప బేతాళుఁడు పిశాచగణములతో నేతెంచి పెద్ద
గద్దియ నెక్కి కూర్చుండి మంత్రులఁ జూచి "సచివోత్తము
లారా! నేఁడు విశేషములేమి!" అని ప్రశ్నించెను. మంత్రులలో
నొక్కొక్కఁడు లేచి యొక్కొక్కవిశేషమును జెప్పుచుండెను.
మంత్రులెల్లరు వచించినపిదప నొకపిశాచము లేచి నమస్క
రించి "మహారాజా! నాకు బహుదినములనుండియుఁ దిండిలేక
కృశించి పోవుచున్నాఁడను. ఈయాఁకటిబాధ నాఁపుకొన శక్య
ముగాక యున్నది." అని వేఁడుకొనెను.

ఆ పిశాచవాక్యములను విని తా బేళుఁడు "ఓభూతమా!
భోజరాజుసభయం దొకబ్రాహ్మణుఁడు 'అ ప్ర శి ఖ' యను
నాలుగక్షరములకు నర్థమేమని యడిగెను భోజరాజాప్రశ్నము
నకు మాసము దినములలో నర్థము చెప్పకపోయిన బండితుల
కెల్లరకు శిరశ్ఛేదము సిద్ధమని యాజ్ఞాపించెను. ఈనాలు గక్ష
రములకు నర్థ మెవరును గనుఁగొనలేకపోయిరి. కాళిదాసు అన్య
దేశ గతుఁడై యున్నాఁడు. నేటితో ముప్పదిదినములు ముగిసి
నది. ఉదయము కాఁగానే భోజరాజు పండితుల నెల్లఁ బ్రాణము
దీయఁగలఁడు. కావున నీకు యథేచ్ఛముగ నాహారము లభిం
చును, పొమ్ము" అని యుత్తరు విచ్చెను.

ఆభూతము బేతాళునిఁజూచి "స్వామీ! ఆనాలు గక్షర

ముల కర్థమేమో జెప్పఁదగిన సెలవీయఁ గదే” అని వినయ పూర్వకముగఁ బ్రార్థించెను.

బేతాళుఁ డిట్లు వక్కాణించెను. “ఓభూతమా! ఈనాలు గక్షరములు నొకశ్లోకము యొక్క నాలుగుపాదముల మొదటి యక్షరములు. ఆశ్లోక మేది యన:—

“అనేన తవ పుత్త్రస్య ప్రసుప్తస్య వనాన్తరే,
శిఖా మాదాయ హస్తేన ఖడ్గే నోపహతం శిరః.”

‘నీపుత్త్రుఁ డరణ్యమధ్యమున నిద్రించుచుండఁగా నితఁ డతని జుట్టును జేతితో బట్టుకొని ఖడ్గముచేఁ దలను దెగనఱికెను.’

ఈయల్పవిషయము నొకపండితుఁ డేనియుఁ జెప్పలేక పోయెను” అని యానాటి భూతసభను జాలించెను.

తరువాత నీపండితపుత్త్రుఁడావటస్కంధమునఁ గూర్చుండి యాబేతాళుని వాక్యములఁ జక్కఁగ విని తెల్లవాఱగనే యింటికే తెంచి మిక్కిలి దీనుఁడై యున్నతండ్రిం జూచి “నాయనా! ప్రతిదినమునందువలెఁ గాక నేడేమో మీముఖము వాడి యున్నది. ఇట్టిచింతకుఁ కారణ మేమి” అని యడుగఁ దండ్రి యెల్ల వృత్తాంతముఁ జెప్పెను. కుమారుఁడు విని “నాయనా! మీరు చింతింప నక్కఱలేదు. నన్ను భోజసభకుఁ గొనిపొండు. ఆ నాలుగక్షరములకు నేను సమాధానమును జెప్పెదను” అని చెప్పెను. తండ్రి వినియు నతఁ డజ్ఞానవశమున నెగతాళికిఁ జెప్పుచున్నాఁ డని తలఁచి సభకుఁ దీసికొని పోవ సమ్మతింపక యెంతయో హఠము సేయ నారంభించినందున నెట్టకేలకు సమ్మతించెను.



తరువాత నతఁడు భోజనము సేయుటకుఁ బోయెఁ గాని యేమి రుచింపక పోయెను. కుమారుఁడు మాత్ర మత్యంత సంతోషమున సంపూర్ణముగ భోజనము సేసెను.

పిమ్మటఁ బండితుఁడునుబుత్త్రుఁడును దక్కంగలకొందఱు పండితులునుగలసి భోజసభకుం బోయిరి. భోజరాజు పండితులు నందఱం గలయం గనుఁగొని “ఓపండితులారా! ఆనాలుగు అక్షరముల కర్థ మేమని యూహించితిరి? చెప్పుఁడు”అని యడిగెను. పండితులెల్లఁ దలలు వాంచి లజ్జయు భయమును ముప్పిరి గొన నూరక యుండిరి. ఈపండితపుత్త్రుఁడు లేచి ధైర్యముతో “అయ్యా! నేను మీ రడిగినప్రశ్నమునకు సమాధానము చెప్పెదను వినుము. ఈ ‘అ ప్ర శి ఖ’ యను నాలుగు నొక శ్లోకము యొక్క నాలుగుపాదముల మొదటి యక్షరములు” అని పలికి పూర్వము బేతాళుఁడు చదివినశ్లోకమును బూర్ణముగఁ జదివెను.

పదునాఱేండ్లప్రాయముగల యాబాలుని వాక్యము విని భోజుఁడును దక్కంగలపండితులు నత్యాశ్చర్యము నొందిరి. భోజరాజు “ఈబాలకుఁ డేమియుఁ జదువుకొనినవాఁడుగాఁడు. ఐనను సులభముగ నిట్టి కఠినప్రశ్నమునకు సమాధానముఁ జెప్పఁజాలు మహావిద్వాంసుఁ డగుటవలన నితఁడు నిస్సందేహముగ నొకమహాపురుషుఁడుగ నుండఁ దగును” అని తలఁచియు ‘ఇతఁడు చెప్పినదానికిఁ బ్రమాణమేమి’ అని విచారించి యాబాలకునితో “బాబూ! నీవు చెప్పినది సరియే కాని యిది సత్య మగుటకుఁ బ్రమాణ మేమి” యని యడిగెను.

పండితపుత్రుఁడు "మహారాజా! ఈనాలు గక్షరముల నెవఁడు వ్రాసి తీసికొని వచ్చెనో యాతని నిచటికిం బిలిపించి నచో నప్రమాణముగ నిరూపించెదము" అని బదులుచెప్పెను.

తరువాత భోజరాజు సమ్మతించి సుశర్మను సభకుఁ బిలిపించెను. దోషి యగుటవలన సుశర్మ మొగము కళలేక వెల్లనై యుండెను. పండితకుమారుఁ డెల్లవృత్తాంతమును వెల్లడింప సుశర్మ యెట్టకేలకుఁ దాను సోదరుని జంపితినని యొప్పుకొనెను. భోజరా జతనికిఁ దగినశిక్ష విధించి యాబాలునికిఁ దనయాస్థానమునఁ బండితపదవి నొసంగెను. పండితులెల్లరు నతఁడుచేసిన యుపకారమును దలఁచుచు నెంతయో మైత్రితో మెలఁగుచుండిరి.

ఇఁక నచట మఱ్ఱిచెట్టుపై బేతాళునివలన ననుజ్ఞదీసికొనివచ్చినభూతము సంతోషము బాఱగా 'ఎప్పు డెప్పుడు తెల్లవాఱునా! పండితుల నెల్ల నెప్పుడు గడుపునిండ నాఁకలిదీఱ భుజింతునా!' అని కాటిదగ్గఱ నక్కవోలెఁ గాచుకొని యుండెను.

ఇంతలోఁ దెలతెలఁ దెల్లవాఱెను. జాముప్రొద్దెక్కెను. మధ్యాహ్న మాయెను. క్రమముగ సాయంకాలముగూఁడ గడచెను. రాత్రి రెండుజాములయ్యెను; గాని తనకోర్కెదీరునట్లు పండితులమాంసము లభింపకపోయెను. ఈలాగునఁ గాచియుండి యేమియు లాభములేక బేతాళునికడ కేగి "మహాప్రభూ! నిన్నటిరాత్రి నాకుఁ గడుపారనాహారము లభించునని సెలవిచ్చితిరి గదా! కనిపెట్టుకొని యుండి విసుగువచ్చినది. ఒక్కమను



ష్యుఁ డేనియు లభింపలేదు" అని మొఱపెట్టుకొనియెను. ఆ భూతము మొఱ్ఱవిని "ఓదయ్యమా! నిన్నటిదినము నే నావృత్తాంతమును జెప్పునపుడు వృక్షము మొదలున నొకపండితపుత్రుఁడు గూర్చుండి సంగతినంతయు విని యానాలుగక్షరములకు నర్థముచెప్పి పండితులచావును దప్పించెను కావున నీకాహారము లభింప లేదు" అనిచెప్పి బేతాళుఁడు సభఁ జాలించెను.

# 15

# కపటసన్యాసులు.

భోజరాజమహాస్థానంబున నన్నూఱుమంది పండితకవులుండిరి; గాని వారియందఱిలోఁ గాళిదాసే యత్యంత విద్వాంసుఁడును మహాకవియు నై యుండెను. గావుననే భోజరాజతని నత్యంతముగ గౌరవించుచుండెను.

ఒక పండితకుమారుఁ డందఱిలోపల శ్రేష్ఠుఁడుగ నుండెను; గాని యతనికిని గాళిదాసునితో సమానమగు గౌరవము జరుగకుండెను.

ఒకనాఁ డాపండితకుమారుఁడు తనమిత్రులతో నేకాంతముగఁ జేరి "మిత్రులారా! నే నెంతవిద్యాపరిశ్రమ యొనర్చినను రాజునన్నుఁ గాళిదాసునిసాటిగ గౌరవింప కున్నాఁడు. ఎన్నివిద్యలలో నెంత కష్టపడినను ఫల మేమి గలదు? కావున నేయుపాయ మేనియు నొనర్చి కాళిదాసును ధారానగరమునుండి వెడ

లఁగొట్టినఁ గాని నాకు గౌరవము లభింపదు. అపుడు జగత్ప్రఖ్యాత మగు కీర్తిఁ బడయవచ్చును. ఏదేని యుపాయ మున్న నాలోచించి చెప్పుఁడు." అని యడిగెను.

ఒకమిత్రుఁ డిట్లు చెప్పెను. "మిత్రమా! ఈయాస్థానమున నెందఱో పండితులు గలరు? గాని వారిలోఁ బదిమంది మిక్కిలి వృద్ధులై యున్నారు. వారిని సంసారమునందు విరక్తిచేఁ గాశికిఁ బోవునటుల నొప్పించి వారితోఁ గూడఁ గాళిదాసును గాశి కేగునట్లు చేయువలయును. ఇదియే యుపాయముగఁ దోఁచు చున్నది."

అని చెప్పఁగా నాపండితకుమారుఁడు సమ్మతించి వృద్ధపండితులకడ కేఁగి యావృత్తాంతమును జెప్పెను. వారును గాళిదాసుపై ననూయఁజెంది యుండిరి గాన నెట్లేనియుఁ గాళిదాసుని వెడలనడచుటకు నియ్యకొనిరి.

తరువాత నేడుగు రెనమండ్రు పండితులు గలసి కాళిదాసునికడ కేగి "మిత్రమా! మనము బహుదినములనుండి యీసంసారసముద్రములోఁ బడి కొట్టుకొనుచు నాత్మవిచారము నించుకయేనియుఁ దలఁపక వ్యర్థముగఁ గాలముగడపితిమి. ఇఁక నైనను మనశరీరములోఁ గొంచెము దార్ఢ్యము గలిగి యున్నప్పుడే కాశి కేగి యాపుణ్యస్థలమున గంగానదీతీరమున సన్యాసమును గ్రహించి భగవద్ధ్యానమునఁ గాలము గడపుచుండిన నెంతయు శ్రేయస్కరము. ఈసంసార మనిత్యము గదా! దీనిలో మెలంగుటకన్న నిత్యమగు మోక్షమునొసంగు



వేదాంతచర్యయందు మెలంగుట యుత్తమోత్తమము. కావున మే మందఱము నాలోచించి రేపటిదినము కాశి కేగఁ దలఁచి యున్నారము. నీకును సమ్మతియేని యందఱ మొక్కపరి భోజుని యానతిఁ గైకొని ప్రయాణ మయ్యెదము." అని చెప్పిరి.

ఈసంగతి నంతయుఁ గాళిదాసు కపటముగా నెఱింగి యాయభిప్రాయమును వెలువడనీక యత్యంతసంతోషమును గనఁబఱిచి కాశి కేగుటకు సమ్మతించెను.

మఱునాఁడు వీరందఱుఁ గలసి భోజుని సభ కేగి తమ యుద్దేశమును దెలియఁ జేసిరి. భోజుఁడు సంతస మంది "ఆహా! ఎట్టి సంతోషకరమగు వృత్తాంతమునువింటిని. మహావిద్వాంసు లగు మీకుఁ దక్క నిట్టివిచార మెవరికిఁ గలుగును? మీరు యథేచ్ఛముగఁ గాశి కేగి యాగంగాతీర్థములఁ గ్రుంకుచు నానందాతిరేకమునఁ గాలముఁ గడుపుఁడు. ఇచట మీపుత్రులు సభాకార్యముల నిర్వర్తింపఁ గలరు" అని సమ్మతించెను. అంతఁ బండితు లందఱుఁ జేరి కాళిదాసుతోఁగూడఁ బయనమై కొన్ని దినములకుఁ గాశికిఁ జేరి యచట నృసింహభారతి యను మహాయోగి దర్శనముఁ జేసికొనిరి. అపు డొకపండితుఁడు నమస్కరించి చేతులు జోడించి యిట్లు ప్రార్థించెను.

"ఓమహానుభావా! ఎన్నిపుణ్యము లొనర్చిననో కాని దేవరవారిదర్శనము లభించుట దుర్లభము. మిమ్ముల సేవించుట వలన ధన్యుల మైతిమి.

"అత్రత్య పాప మపి పుణ్యసమం మదీయం
ఆత్రత్య దుఃఖ మపి సర్వసుఖాస్పదం మే,

అత్రత్యావృత్తి రపి వైషయికీ సమాధిః
శ్రీమన్నృసింహ గురుదర్శన పూర్ణలాభాత్."

"ఓస్వామీ! నృసింహభారతీ! దేవరివారిసేవ లభించుటవలన నిచ్చటిపాపమును బుణ్యసమ మైనది. దుఃఖమును సుఖసమ మైనది. ఇచట నునికియు సమాధిలో నునికి యున్నది గదా!" నృసింహభారతి వారిప్రార్థనను విని ప్రసన్నుఁడై "ఓపండితులారా! మీయభిప్రాయమేమో తెలియఁ జేయుఁడు" అని యడిగెను.

"స్వామీ! సంసారమునుండి విరక్తివలన మీపదముల నాశ్రయించి సన్యాసమును గైకొనఁ దలంచి వచ్చినారము. మమ్మనుగ్రహింపవలయును" అని వారు ప్రార్థించిరి.

నృసింహాచార్యుఁడు "ఓపండితులారా! మీకట్లుకోరిక యేని యట్లే కావచ్చును. అయిన నెల్లరు నొక్కదినమునఁ గాషాయముఁ దీసికొనుట సమంజసము కాదు. కావున నొక్కొకదిన మొక్కొకఁడు సన్యసించిన బాగుగ నుండును" అని చెప్పెను.

పండితులు వల్లె యని గురువునకు నమస్కరించి వెడలిపోయి యొక్కచోఁ జేరి "మొదట నెవఁడు సన్యాసమునకుఁ యోగ్యుఁడగును" అని యాలోచించుకొని కపటరీతిఁ గాళిదాసుని సన్యాసిగఁ జేయఁ దలఁచి వచ్చిరి. గావున వారిలో నొక పండితుఁడు "మిత్రులారా! మనయందఱిలోఁ గాళిదాసేమిగుల శ్రేష్ఠుఁడు. ఈతఁడే ప్రప్రథమమున సన్యాసమును గ్రహించిన నెంతయు బాగుగ నుండును." అని వచింప నెల్లరు సమ్మతించిరి.



మఱునాఁ డొక పండితుఁడు సన్యాసము దీసికొనుటకు నృసింహభారతిస్వామికడకేతెంచి నమస్కరింపనతఁడు నీకేమి కోర్కి గల దని యడిగెను. అతఁడు తన యధ్యవసాయమును వెల్లడింప నెంచి రెండుచేతుల నెత్తి యీలాగున గంభీరస్వరముఁ బలికెను.

"కదా వారాణస్యా మమరతటినీరోధసి వసన్
వసానః కౌపీనం శిరసి విదధానోఽఞ్జలిపుటమ్,
అయే గౌరీనాథ త్రిపురహర శంభో త్రినయన!
ప్రసీదే త్యాక్రోశ న్నిమిష మివ నేష్యామి దివసాన్."

"ఈ కాశీమహాక్షేత్రమున విశ్వనాథుని యాలయము దగ్గఱ గంగాతీరమున నివసించుచుఁ గౌపీనము ధరించి రెండు చేతులు నెత్తిపై నుంచుకొని 'ఓగౌరీనాథ! ఓత్రిపురహర! ఓశంభూ! ఓత్రినయన! ప్రసన్నుఁడవు కమ్ము' అని ప్రార్థించుచు దినములను నిమిషమువలె నెపుడు గడపుదునో కదా?"

ఇట్లు మిగులనార్తుఁడై పఠించిన యాపండితునకు గురువు సన్యాస మొసంగెను.

రెండవదినము నట్లే మఱియొకపండితుఁడు నరసింహభారతిస్వామి సన్నిధి కేతెంచి నమస్కరింప నతఁడు 'నీ కేమి కోరికగలదు' అని యడిగెను. ఆపండితుఁడు రెండుచేతులెత్తి యుచ్చైస్స్వరమున నిట్లు వచించెను.

"కదా బృందారణ్యే విమలయమునాతీరపులినే
చరంతం గోవిందం హలధరసుదామాదిసహితమ్,

అయే కృష్ణ! స్వామిన్! మదన మురళీవాదన విభో
ప్రసీదే త్యాక్రోశ న్నిమిష మివ నేష్యామి దివసాన్."

"బృందావనమున కేగి యచ్చట తెల్లని యమునానది యిసుకతిన్నెలపై బలరాముఁడు సుదాముఁడు మున్నగువారితోఁ గూడి యాడుచుఁ బాడుచుఁ గ్రీడల సల్పు కృష్ణుని 'ఓ కృష్ణా! ఓస్వామీ! జగన్మోహనముగ మురళివాయించుచుండునో మహానుభావా! అనుగ్రహింపుము' అని ప్రార్థించుచు దినములను నిమిషములవలె నెప్పుడు గడుపుదునో కదా?"

ఇట్లు పలికిన యా పండితునకు సన్యాసదీక్ష నొసంగెను.

తరువాత మూఁడవదినమున మూఁడవపండితుఁడు వచ్చి నమస్కరించెను. అతని నట్లే యడుగఁగా నతఁ డిట్లు పఠించెను.

"కథా వా సాకేతే విమలసరయూతీరపులినే
చరంతం శ్రీరామం జనకతనయాలక్ష్మణయుతమ్,
అయే రామస్వామిన్! జనకతనయావల్లభ! విభో!
ప్రసీదే త్యాక్రోశ న్నిమిష మివ నేష్యామి దివసాన్."

"అయోధ్య కేగి యచ్చట సరయూనదీతీరమునందలి యిసుకదిబ్బలపై విలాసముగ సీతాలక్ష్మణసహితుఁడై సంచరించుచుండు శ్రీరామచంద్రుని 'ఓ రామచంద్రా! స్వామీ! సీతాపతీ! మహాప్రభూ! అనుగ్రహింపుము' అని ప్రార్థించుచు దినములను నిమిషమువలె నెప్పుడు గడపుదునో కదా!"

ఆ పండితునకు దీక్ష నొసఁగెను.

నాలవదినమున నాలవపండితుఁడు సన్యాసమును దీసి



కొన నేతెంచెను. 'నీ కేమికోర్కె'యని గురు వడుగ నీలాగునఁ బఠించెను.

"కదా శ్రీమ న్నీరానరహరిపురే సింహవదనం
హరిం పశ్య న్నుచ్చై రుదితమనసా దీనదయినమ్,
అయే లక్ష్మీకాంత శ్రితజనభయారే నరహరే
ప్రసీదే త్యాక్రోశ న్నిమిష మివ నేష్యామి దివసాన్."

"శ్రీనీరానరహరిపురమునందుదీనదయాళుఁడును సింహముఖుఁడును భగవంతుఁడునగు శ్రీనృసింహస్వామిని సంతోషముతో "ఓ లక్ష్మీనాథా! శ్రితజనార్తిహరా! నరహరీ! అనుగ్రహింపుము" అని యుచ్చైస్స్వరమునఁ బ్రార్థించుచు దినములను నిమిషమువలె నెప్పుడు కడపుదునో కదా!"

అని యార్తిచేఁ బలికిన యా పండితునకు సన్యాస మొసఁగెను.

ఐదవనాఁ డయిదవపండితుఁడు వచ్చి నమస్కార మొనర్చెను పూర్వరీతిగ "ఓపండితుఁడా! నీ కేమి కోర్కెగలదు" అని యడుగ నతఁ డిట్లు వక్కాణించెను.

"కదా ప్రేమోద్గారైః పులకితతనుః సాశ్రునయనః
స్మర న్నుచ్చైః ప్రీత్యా శిథిలహృదయే గద్గదగిరా,
అయే శ్రీమ న్విష్ణో రఘువర యదూత్తంస నృహరే
ప్రసీదే త్యాక్రోశ న్నిమిష మివ నేష్యామి దివసాన్."

"అనవరతము భక్తిపారవశ్యముచేత శరీర మంతయు గగుర్పాటుఁ జెందఁ గనులనుండి యానందాశ్రువులు గాఱుచుండ నెంతయు శిథిల మగు హృదయముతో గద్గద మగు

వాక్కుతో నిరతిశయ మగుప్రీతితో 'ఓవిష్ణూ! ఓరఘువీరా! ఓ యదూత్తంసా! ఓ నరహరీ! అనుగ్రహింపుము' అని యాక్రోశించుచు ననేకదివసముల నొకనిమిషము వోలె నెప్పుడు గడపుదునో కదా!"

అని చెప్ప గురు వత్యంతానందము నొంది యాపండితు నకు సన్న్యాసము నొసంగి యంపెను.

తరువాత నాఱవదినము నాఱవపండితుఁడు బయలు దేరి వచ్చి నమస్కరించెను. గురు వతనిని 'నీ కేమి యిచ్చ గలదు' అని ప్రశ్నించెను. అతఁ డిట్లు ప్రత్యుత్తర మొసంగెను.

"కదా సీతాశోకత్రిశిఖజలదం చాంజనిసుతం
చిరంజీవం లోకే భజకజనసంరక్షణకరమ్,
అయే వాయో స్సూనో రఘువరపదాంభోజమధుప
ప్రసీదే త్యాక్రోశ న్నిమిష మివ నేష్యామి దివసాన్."

"లంకాపట్టణమున రావణునిచేఁ జెరఁ బెట్టఁబడిన సీతాదేవి దుఃఖ మనునగ్నికి మేఘమునుఁ బోలినవాఁడును, ఎల్లకాలము జీవించువాఁడును, ఆశ్రితజనుల నతిదయారసమునఁ బరిపాలించువాఁడును నగు శ్రీయాంజనేయుని 'ఓ వాయుకుమారా! శ్రీరామపాదకమలభ్రమరా! ఆంజనేయా! అనుగ్రహింపుము' అని గొంతెత్తి యాక్రోశించుచు ననేకదినముల నొకనిమిషమువలె నెప్పుడు గడపుదునో కదా!"

ఈలాగునఁ బదిదినములుఁ బదిమంది పండితులు సన్న్యాసాశ్రమమును గైకొనిరి.



తరువాతఁ గాళిదాసు తనకపటాభిప్రాయము నెరికిఁ దెలియఁ జేయక నిజముగ సన్న్యాసమును దీసుకొనువానివలె నటించుచు నృసింహభారతిస్వామిసన్నిధికేతెంచి నమస్కార మొనర్చెను. గురువు "ఓయీ! నీ కేమి యిచ్ఛగలదు?" అనియడిగెను. కాళిదా సాలోచించి చమత్కారముగ నిట్లు వచించెను.

"కదా కాంతాగారే పరిమళమిళత్పుష్పశయనే
శయానః శ్యామాయాః కుచయుగ మహం వక్షసి వహన్,
అయే స్నిగ్ధే ముగ్ధే చపలనయనే చంద్రవదనే
ప్రసీదే త్యాక్రోశ న్నిమిష మివ నేష్యామి దివసాన్."

"ప్రియురాలి యంతఃపురమున ఘుమఘుమవాసనలీను వక్షస్స్థలమునఁ బ్రియురాలి గబ్బిగుబ్బల గట్టిగఁ గ్రుమ్ముకొని కౌఁగిలించి పరుండి యుండి యానందమున, 'కాంతా! ముద్దరాలా! గోలా! బేలా! చపలనయనా! చంద్రవదనా! అనుగ్రహింపుము' అని పలుకుచు బహుకాలము నొకనిమిషముగ నెపుడు గడపుదునో కదా?"

ఇట్లు పలుక నృసింహభారతిస్వామి విని "ఓపండితుఁడా! నీమన స్సింకను బరిపక్వము కాలేదు. సంసారమునందలి విషయవాసన వదల లేదు. వైరాగ్యము జనింపలేదు. కావున నీకుఁ దురీయాశ్రమాధికారము లేదు. నేనునీకిపుడుసన్న్యాసమునీయను. పొమ్ము" అని చెప్పెను.

కాళిదాసు విని "స్వామీ! ఈపండితులతోడఁ దమదగ్గఱ నేను సన్న్యాసమును దీసుకొనెద నని చెప్పి యుంటిని. ఆమాట యిప్పు డెట్లు తప్పుదును? న న్నసత్యవాదిని గాఁ జేసెదరా?"

అని యతినడిగెను. "కవీశ్వరా! అదియంతయు నాకుఁ దెలియదు. నీకు సన్న్యాసము గ్రహింపవలయు నని యాసయున్నచోఁ మఱియొకయతి కడ కేగి గ్రహింపుము. చెడుగులకు నేను సన్న్యాసము నిచ్చునది లేదు." అని నృసింహాయతి చెప్పఁగా "మీరు నాకు సన్న్యాసమీయకున్నచోఁ మఱియొకనిదగ్గఱ నేను సన్న్యాసమును దీసికొనను. నే నీపండితులదగ్గఱ బ్రతిజ్ఞ చేసితిని. అయ్యది యిప్పు డెట్లు భిన్నముగాఁగలదు'?' అని కాళిదాసనియెను. నృసింహాయతి "అయ్యో! నీవు సన్న్యాసమును దీసికొందువు గాని నే నిచ్చునది లేదు. కావున నిందు నీదోషమేమియు లేదు." అని బదులు చెప్పెను.

కాళిదాసు సంతసించి పండితులతో 'ఓ మహాశయులారా! ఇందు నా దేమి దోషము లేదు. గురువు గారు సన్న్యాసమీయ నని చెప్పుచున్నారు. కావున నేనిచ్చటనుండిన లాభమేమి గలదు? మీ రందఱు నాకనుజ్ఞ యిచ్చెద రేని స్వగ్రామమున కేగెదను.' అని పలికి బయలు దేరి ధారానగరముఁ జేరి యీ కాశీవృత్తాంతము నంతయు భోజరాజునకుఁ జెప్పెను. రాజు విని కడుపుబ్బ నవ్వి కాళిదాసు నెంతయు గారవించెను.

భోజసభయం దున్నక్రొత్తపండితునకు మరలఁ గాళిదాసు వచ్చినాఁ డని తెలిసి గుండెలలో రాయిబడెను. వృద్ధుఁడగు తన తండ్రి కాశిలో సన్న్యాసి యయ్యెనని విని వారి సంగతి నడుగుటకై కాళిదాసు కడ కేతెంచెను. కాళిదా సతనికి స్వాగత మొసఁగి "అయ్యా మీతండ్రిగారు నాకు సన్న్యాస



మిప్పింపఁ దలఁచి కాశికిం బిలుచుకొని పోయినారుగదా! కాని నాకు సన్న్యాసము లభింప లేదు. పూర్వపుణ్యవశమున వారు మాత్రము సన్న్యాసముఁ దీసికొని కళ్యాణము నొందిరి. మరల నీసంసారసముద్రములోఁ బడి తిరుగుడు పడ నేనిచ్చటికి వచ్చితిని." అని చెప్పి పండితపుత్త్రుల నోదార్చెను. తరువాత యథారీతిగ నెల్లరు వారివారి కార్యములఁ బ్రవర్తించియుండిరి.

---

## 16

## జానుదఘ్నకవి.

---

ఒకనాఁడు భోజరాజు వేటాడ నెంచి తెల్లగుఱ్ఱము నెక్కి స్వారి వెడలి యరణ్యమార్గముఁ బట్టి పోవుచుండెను. మార్గమధ్యమునఁ గట్టెలమోపు నెత్తినిబెట్టుకొని నదిని దాఁటు నొకబ్రాహ్మణుని గనుఁగొని సమీపమున కేగి

"కియన్మానం జలం విప్ర?"

"ఓ బ్రాహ్మణుఁడా! నీ రెంతలోఁతు" అని యడిగెను. ఆబ్రాహ్మణుఁడు విని—

"జానుదఘ్నం నరాధిప"

"ఓ రాజా! మోఁకాలిలోఁతు" అని బదులు చెప్పెను. భోజరా జత్యాశ్చర్యమునొంది—

"ఈదృశీ కి మవస్థా తే"

"నీ కీదశయేమి" అని యడిగెను. బ్రాహ్మణుఁడు ప్రత్యుత్తరము నిట్లు చెప్పెను.

" న హి సర్వే భవాదృశాః"

"అందఱు నీవంటివారు గారు గదా!"

భోజుఁడు మిక్కిలి ప్రసన్నుఁడై యిట్లనియె.

"ఓవిద్వాంసుఁడా! నాబొక్కసదారుని దగ్గఱ కేగి నా యానతిచొప్పున లక్షరూప్యములఁ దెచ్చికొనుము."

తరువాత బ్రాహ్మణుఁడు సంతసించుచుఁ గోశాధ్యక్షుని కడ కేగి "అయ్యా! భోజరాజు మిమ్ముల నడిగి యొకలక్షరూప్యముల దెచ్చికొనుమనియాజ్ఞాపించినాఁడు. ఆధనమునునిచ్చిన నే నేగెదను" అని యడిగెను. అతఁ డాబ్రాహ్మణుని వేషమును గనుఁగొని పక్కున నవ్వి "బాపఁడా! నీవు లక్షరూప్యములకుఁ దగుదువా?" అని డబ్బు నీయకయే పంపివేసెను.

ఆ బ్రాహ్మణుఁడు మిక్కిలి ఖిన్నుఁడై మరల రాజు సన్నిధి కేతెంచి "రాజా! మీబొక్కసదారుఁడు లక్షరూప్యములకునీవు తగుదువా? యని రొక్క మీయకయే వెడలఁ గొట్టినాఁడు" అని మొఱపెట్టుకొనెను. భోజరాజు చూచి జాలి నొంది "విప్రోత్తమా! రెండులక్షల నడుగుము. తప్పక యిచ్చును" అని చెప్పి పంపెను.

మరల బ్రాహ్మణుఁడు బొక్కసగాని దగ్గఱ కేగి యడుగ "పాఱుఁడా! నీవు రెండులక్షలకుఁ దగవు పోవయ్యా!" అని మరలఁ బంపివైచెను. బ్రాహ్మణుఁడు కోపము నొందియు లో



నిముడ్చుకొని భోజునికడ కేతెంచి "రాజేంద్రా! నీబొక్కసగాఁడు పరమమూర్ఖుఁడుగా నున్నాఁడు. ఇప్పుడు గూడ నవ్వుచు నీవు రెండులక్షలకుఁ దగవు పొమ్మనినాఁడు. తరువాత తమచిత్తము" అని పలికెను.

భోజుఁడు విని చిఱునగవు నగి "బ్రాహ్మణోత్తమా! శ్రమ మని తలంపక యీమాఱుపోయి 'మూఁడు లక్షలు భోజరాజిమ్మనియె' నని చెప్పియారొక్కమును బుచ్చుకొనుము" అని వెండియు నా బ్రాహ్మణుని గోశాగారాధ్యక్షునికడ కంపెను. అతఁడు పోయి యాబొక్కసవాని నడుగ నవ్వుచు నేమియు బదులుపలుకక యూరకుండెను. బ్రాహ్మణుఁడు మండిపడి బిర బిర భోజరాజుకడ కేతెంచి శరీర మంతయుఁ గోపవశమునఁ జలించుచుండఁ బెదవులు గొఱుకుకొనుచు నిట్లనియె.

"రాజన్ కనకధారాభిః త్వయి సర్వత్ర వర్షతి,
అభాగ్యచ్ఛత్రసంపన్నే మయి నాయాంతి బిందవః."

"ఓరాజా! నీవు దేశమం దంతట బంగారు వానను గురియుచున్నను దౌర్భాగ్య మనుగొడుగును ధరించిన నాపై మాత్ర మొకబిందు వైనను బడకున్న యది" ఇంతియకాక

"త్వయి వర్షతి పర్జన్యే సర్వే పల్లవితా ద్రుమాః,
అస్మాక మర్కవృక్షాణాం పూర్వపత్రేషు సంశయః."

"ఓరాజా! నీవనుమేఘము బంగారువాన గురియుచుండ యాచకులను వృక్షములెల్లను జక్కఁగఁ జిగిర్చినవి కాని మే మను జిల్లేడుచెట్లకు మాత్రము ముందుండిన యాకులకుఁ (కష్టైల

మోపు) గూడ మోసము గలుగునేమో యని భయమగుచున్నది."

ఈబ్రాహ్మణుని దైన్యముఁగని భోజుఁడు "అయ్యో! పాపము బ్రాహ్మణుఁడు మిగుల దుఃఖితుఁ డయ్యెఁ గాఁబోలు" అని యాలోచించి యొకసేవకుని నాబ్రాహ్మణుని వెంటనిచ్చి "బ్రాహ్మణోత్తమా! కోపింపకుము. ఈభటునితోడ గోశాధ్యక్షునియొద్దకేగి మూఁడులక్షల రూప్యములను బదియేనుంగులను గైకొనుము" అని గారవించి వీడ్కొలిపెను. పిదప బొక్కసదారుఁ డాధనము నొసఁగి సంతోష పఱిచెను.

---

# 17
# భాస్కరుఁడు - శాకల్యుఁడు.

---

ఒకనాఁడు భోజరాజు ధారానగరమున సంచరించుచు నొకశివాలయమునఁ బరుండి యుండిన యిద్దఱు బ్రాహ్మణులఁ గనుఁగొనియెను. వారిలో నొకఁడు నిద్ర లేచి నిద్రించుచున్న రెండవవానిఁ జేతితోఁదట్టుచు "అయ్యా! నీవెవ్వఁడవు? నిద్రించుచున్నావా? మేలుకొని యున్నావా!" యని యడిగెను.

రెండవవాఁడు నిద్ర లేచి కనులు నలుపుకొనుచు దృష్టిని నిగుడ్చి సంభ్రమముగ "అయ్యా! నమస్కారము. నేనుబ్రాహ్మణపుత్రుఁడను, నీ విచ్చటఁ బరుండియుండఁగా దీపము వెలుతురున జందెము, కమండలువు నుండుటచూచి బ్రాహ్మణుఁడవని



యెఱింగి జాము ప్రొద్దు పోయినవెనుక నీపడకవెంబడి పరుండితి, ఇప్పుడు నీమాటల విని మేలుకొనినాఁడను" అని విన్నవించెను.

మొదటి బ్రాహ్మణుఁడు సంతసించి "నాయనా! నమస్కరించెద వేనిదీర్ఘాయుష్మంతుఁడవుగమ్ము. నీవెక్కడనుండివచ్చితివి? నీపే రేమి? నీయూ రేమి? నీకిచ్చట నేమిపనిగలదు? అనియడిగెను.

రెండవబ్రాహ్మణుఁడు "విప్రోత్తమా! నాపేరుభాస్కరుఁడు, పశ్చిమసముద్రతీరమునఁ బ్రభాసతీర్థసమీపమున నానివాసము; అచ్చటివా రనేకులు భోజుఁడు మిక్కిలి దాతయని పలువిధములుగ వర్ణించుచున్నారు. కావున నాభోజరాజును యాచించి నాదారిద్ర్యమును బోఁగొట్టుకొన నెంచియున్నాఁడను. నీవు పెద్దవాఁడగుటవలన మాతండ్రిగారిని జూచినలాగు నున్నది, మీ రెవరో తెలియఁ జేయ వేడెద" నని పలికెను.

మొదటిబ్రాహ్మణుఁ డది విని "నాయనా! నాపేరు శాకల్యుఁడు, నేను గూడ నేకశిలానగరమునుండి భోజరాజు కడకే వచ్చుచున్నాఁడను. బాబూ! నిన్నుఁజూచినప్పటినుండియునీలక్షణములే యేదోదుఃఖమును చెప్పకయ చెప్పుచున్నవి. నీకేమి దుఃఖము గలదు చెప్పుము" అని యడిగెను. ఆతఁ డిట్లు చెప్పం దొడంగెను. అయ్యా! నాదుఃఖము నేమని చెప్పఁ గలను?

"క్షుత్క్షామా శ్శిశవః శవా ఇవ భృశం మందాశయా బాంధవాః
లిప్తా జర్జరఘర్ఘరీ జతులవై ర్నో మాం తథా బాధతే,
గేహిన్యా త్రుటితాంశుకం ఘటయితుం కృత్వా సకాకుస్మితం
కుప్యన్తీ ప్రతివేశ్మలోకగృహిణీ సూచీం యథా యాచితా."

"బాబూ! నాకష్ట మేమని చెప్పుదును? బిడ్డ లాఁకటిచేఁ గృశించి వీనుఁగులవలెఁ బడి యున్నారు. బంధువు లాదరింపక యుదాసీను లై యున్నారు. కడవకుఁ గఱవై చిల్లులు వడిన యోటికుండకు లక్కమాటు వెట్టి వాడుకొనుచున్నాఁడను ఇది యంతయు నన్నంతగా బాధించుట లేదు; గాని నాభార్యచిఱిఁగినగుడ్డ గుట్టుకొనుటకై ప్రక్కయింటివానిభార్యను సాభిప్రాయమగు చిఱునవ్వునవ్వి సూదియడుగ నామె కసరుటఁ జూచి నాహృదయము సైఁపకున్నయది."

భోజరాజు వీ రిద్దరిసంవాదమును విని జాలి నొంది యాపండితునకుఁ దనయాభరణములన్నియు నొసఁగి "భాస్కరకవీ! నీబిడ్డలు మిక్కిలి కష్టపడుచుందురుగావున త్వరగ నీదేశమునకుఁ బొమ్ము" అని చెప్పెను.

తరువాత శాకల్యుఁడు రాజును గనుఁగొని యిట్లు పఠించెను.

"అభ్యుద్ధృతా వసుమతీ దళితో౽రివర్గః
క్రోడీకృతా బలవతా బలిరాజలక్ష్మీః,
ఏకత్ర జన్మని కృతం య దనేన యూనా
జన్మత్రయే త దకరో త్పురుషః పురాణః."

"నారాయణుఁడువరాహపరశురామ వామనావతారములను మూఁడు జన్మముల నొంది, యందు వరాహమూర్తియై భూమి నుద్ధరించెను.(పాలించెను. ప్రళయసముద్రమునుండి యెత్తెను.) పరశురాముఁడై శత్రువుల సంహరించెను. వామనుఁడై బలిరాజ్యలక్ష్మిని (బలవంతు లగురాజులసిరి బలిచక్రవర్తిసిరి;)



నపహరించెను. ఇట్లు భగవంతుఁడు మూఁడుజన్మములనొనర్చిన మూఁడు ఘనకార్యముల భోజరా జొకజన్మములోనే తరుణవయస్సునందే యవలీల సాధించెను."

భోజరా జీశ్లోకమున కద్భుతము నొంది మూఁడులక్షల నొసంగెను.

## 18
## కవుల కౌటిల్యము.

కాళిదాసు భోజసభను వదలినప్పటినుండియు నిస్తేజస్కమై యేమియుఁ బ్రకాశింపకుండెను. కావున భోజరాజు తాను వ్యర్థముగఁ గాళిదాసు నవమానించినందుల కెంతయుఁ జింతాక్రాంతుఁడై యుండ లీలావతి గనుఁగొని రహస్యముగా విచారమునకుఁ గారణము నడిగెను. భోజరాజు మొదటనుండియు జరిగినవృత్తాంతమును జెప్పఁగా విని యిట్లనియెను. "నాథా! నీవు సర్వజ్ఞుఁడవు, నీ కేదియుఁ దెలియనిది లేదు.

"స్నేహో హి వర మఘటితో న వరం సంజాతవిఘటితస్నేహః,
హృతనయనో హి విషాదీ న విషాదీ భవతి స ఖలు జాత్యంధః."

స్నేహము సేయ కుండుట మేలు గాని స్నేహము చేసి వదలుట మేలుగాదు, కన్నులు పోయినవాఁడు దుఃఖ మొందును గాని పుట్టుగ్రుడ్డివాఁడు దుఃఖింపఁడు గదా"

ఇంతియ కాక కాళిదాసు సరస్వతీదేవి పురుషావతారముగదా! కావునఁ బండితులఁ బంపి యెట్లైనను నతనిఁ బిలిపించినఁగాని మనసభ శోభింపదు.

"దోషాకరో౽పి కుటిలో౽పి కళంకితో౽పి
మిత్రావసానసమయే విహితోచ్ఛ్రయో౽పి,
చన్ద్ర స్తథా౽పి హరవల్లభతా ముపైతి
నైవాశ్రితేషు గుణదోషవిచారణా స్యాత్."

"చంద్రుఁడు దోషాకరుఁడు. (తప్పుల కాటపట్టు, రాత్రిని జేయువాఁడు) అయ్యును, కుటిలుఁడు (వంకర యగువాఁడు-కౌటిల్యము గలవాఁడు) అయ్యును, కలంకితుఁడు (మచ్చ గలవాఁడు-పాపము గలవాఁడు) అయ్యును, మిత్రుఁడు(సూర్యుఁడు-చెలికాఁడు) అవసానము నొందుసమయమున దానుదయము నొందువాఁ డయ్యును శివునిచే నిరంతరము దాల్పఁ బడుచున్నాఁడు."

అనిబోధించెను. భోజరాజంగీకరించి మఱునాఁడు వేశ్యాగృహమునకుఁ బండితుల నంపి కాళిదాసుని రావించి మిగుల గౌరవించెను. అపుడు బాణుఁడనుకవి లేచి రెండుభుజముల నెత్తి యిట్లనియెను.

"భోజః కలావి ద్రుద్రోవా కాళిదాసస్య మాననాత్,
విబుధేషు కృతో రాజా యేన దోషాకరో౽ప్యసౌ."

"ఈకాళిదాసు దోషాకరుఁడు(దోషములకుగని-రాత్రిని జేయువాఁడు)అయినను విబుధులలో(దేవతలలో-పండితులలో) రాజుగా(ప్రభువు-చంద్రుఁడు) చేయఁబడినందున భోజరాజు కలామంతుఁడు (శాస్త్రజ్ఞుఁడు-చంద్రకలగలవాఁడు) అగు శివుఁడే"



తరువాతఁ గొన్ని దినములు గడచినపిదపఁ బండితులెల్లరు మరలఁ గాళిదాసుని గౌరవమును సహింపఁజాలక యేదేని యుపాయ మొనర్చి యతని వెడలఁగొట్టవలయునని తలఁచి యందఱునొక్కచోఁ జేరి బాగుగ నాలోచించి కాళిదాసుని యవగుణమును దాసివలన భోజుని కెఱిఁగించినగాని యీప్రయత్నము చేకూరదని నిశ్చయించి యొకనాఁడు దాసి కడకేగి దానిననేక విధములుగఁ గొనియాడి భూషణముల చేతను గొన్ని రూప్యముల చేతను సంతోషపఱిచి యిట్లనిరి. "ఓదాసీ!భోజుని నిర్మల కీర్తికిఁ గళంకమును సంపాదించు నీకాళిదాసునివలనమాగౌరవము దక్కుటలేదు. కావున నీతని యవగుణమును భోజునికడఁ బ్రకటించి యెట్లయిననుఁ గాళిదాసుని వెడలఁగొట్టవలయును" అని తమ పన్నుగడను జెప్పఁగా నాదాసి యాదుష్టకార్యమునకుఁ దొలుత సంశయించియుఁ దుద కొప్పుకొనియెను.

ఇట్లు పదిదినములు గడచినతరువాత రాత్రిజాముప్రొద్దుపోయినతరి భోజరాజు హంసతూలికశయ్యపై సుఖముగ శయనించి యేదో యాలోచన సేయుచు నిద్రపట్టియుఁబట్టక యుండుసమయమును గనిపట్టి యాదాసి యాపడకటింటికి సమీపమునఁ బరుండి మాయనిద్రఁ బోవుచు నిట్లు కలవరించెను. "మదనమాలినీ! కాళిదాసుని దుర్మార్గమును వింటివి కదా! ప్రతిదినమును దాసీవేషము ధరించి యంతఃపురమునకుఁ జేరి లీలావతీదేవితో భోగించి పోవుచున్నాఁడు. ఇట్టి యన్యాయ మెచ్చట నేని కలదా?"

ఈమాటలు భోజుని చెవులఁబడినంతన తటాలున నులికిపడి లేచి యత్యంతవిస్మితుఁడై "తరంగవతీ! యింకను మేలుకొనియున్నావా" అని పలికెను. ఎల్లరు గాఢనిద్రామగ్నులై యున్నందున నొకరేనియు బదులు వచింపక పోయిరి. భోజుఁడు చింతామగ్నుఁడై "ఔరా! యిచ్చట నెల్లరు నిద్రితులైయున్నారుకదా! మదనమాలినిని సంబోధించి యెవరో యీకర్ణకఠోర వృత్తాంతమును బలుకుచున్నారు. విచారింపఁ దరంగవతియే విలాసవతి దుశ్చరిత్రమును గలవరించునట్లు తోఁచుచున్నది. స్త్రీచరిత్రము నెవరెఱుఁగఁగలరు? ఇట్టియపనిందఁబోఁగొట్టుకొన నుపాయమేదిగలదు? నిశ్చయముగ నాభార్యతోఁ గాళిదాసు మాయావేషమున వ్యభిచారము చేయుచున్నట్లు తోఁచుచున్నది! కావున నెట్లు పరీక్షింపఁదగును" అని యాలోచించి యీసంగతిఁ గనిపెట్టవలయునని మరునాఁ డూరకయే జ్వరము వచ్చినదని మిషపెట్టుకొని సంతాపపీడితుఁడువోలెఁ గృత్రిమముగ ముసుఁగుపెట్టికొని పరుండి దాసివలనఁ గాళిదాసుని బిలిపించెను.

లీలావతియు హఠాత్తుగ జ్వరమువచ్చినందులకుఁ జింతాక్రాంతయై యొక్కచో నిలువఁబడియెను. భోజరాజు భార్యను జూచి "లీలావతీ! భుజింపవలయునని యాశగ నున్నదిగాన సత్వరముగ పథ్యాహారమును గొనిరమ్ము" అని అనురాగపూర్వకముగ బలికెను. లీలావతియు త్వరితముగఁ బాకశాలకేగి యొకబంగారు గిన్నెయం దన్నము పెసరుపప్పు మున్నగుపదార్థములునిడుకొని భోజునిముందుఁ దెచ్చి పెట్టెను. భోజరాజు జ్వరమునం దున్న



వాఁడువోలె నటించుచు మెల్లగఁ బడకనుండి లేచి యాగిన్నెను జేతఁదీసికొని లీలావతీకాళిదాసుల యభిప్రాయ మెఱుంగఁ దలఁచి యిట్లనియెను.

"ముద్గదాళీ గదవ్యాళీ కవీంద్ర వితుషా కథమ్?"

"ఓకవీశ్వరా! రోగమునకు సర్పము (రోగముబోఁగొట్టునది) వంటిదగు నీపెసరుపప్పు పొట్టులేక యున్నది యేల?"

ఆసమయమున లీలావతియుఁ జెంగట నిలుచుండి యుండెను. కాళిదా సాశ్లోకార్థమును విని యిట్లు ప్రత్యుత్తరము చెప్పెను.

"అంధోవల్లభసంయోగే జాతా విగతకఞ్చుకా"

"అన్నమనుభర్తతోఁ గూడఁగనే కంచుకము (పొట్టు-అవిక) వీడిపోయినది."

(భర్త గ్రుడ్డివాఁడువోలె నూరకయుండఁగా జవరాలు దనప్రియునితోఁ జేరఁగనే అవిక వదలించును, అనిధ్వనితము.)

రాణి యీకాళిదాసు వాక్యమును విని చిఱునగవు నగియెను. భోజరాజీ వృత్తాంతమును గనుఁగొని "అకటా! కాళిదాసు నిశ్చయముగ నాభార్యను బ్రేమించియే యుండనోపు. కావుననే కాళిదాసు చెప్పినసాభిప్రాయ శ్లోకమును విని మందహాస మొనర్చినది. ఇట్టి కృత్రిమముల కెల్ల నావాసభూములగు స్త్రీలచరిత్రము నెవరు గనిపట్టఁ గలరు?"

"రాష్ట్రస్య చిత్తం కృపణస్య విత్తం మనోరథం దుష్టహృదంతరాణాం,
స్త్రియశ్చరిత్రం పురుషస్య భాగ్యం దేవో నజానాతి కుతో మనుష్యః"

"లోకములోని సమస్తప్రజలమనస్సును, పిసినారివాని ధనమును, దుర్జనులయొక్క హృదయమును, స్త్రీలచరిత్రమును, పురుషుని యదృష్టమును దేవుఁడే యెఱుంగఁడు. ఇఁక మనుష్యుని జెప్ప నేల?"

"కావునఁ గాళిదాసు వాస్తవముగ నపరాధియే యైనను మహాకవి యగుటఁ జేసి వధింప నర్హుఁడు గాఁడు" అని యాలోచించి కాళిదాసుతో "ఓ కాళిదాసా! నీవు నారాజ్యమున నుండఁ దగవు. కాఁబట్టి శీఘ్రముగ వెడలి పొమ్ము" అని యాజ్ఞాపించెను.

కాళిదాసు మహామేధావి గావునఁ గారణము నూహించి తత్క్షణంబు లేచి బిరబిర వేశ్యాగృహంబున కేతెంచి దానితో నిట్లనియెను. "ఓ ప్రియురాలా! నేఁటితో నీకౌఁగిలింతలు దీఱినవి. నీముద్దుమోముఁ జందురునికాంతుల నాప్యాయత నొందు కాలము పూర్ణమయ్యెను. భోజరాజు మిక్కిలి క్రూరుఁడై నా రాజ్యమునుండి వెడలిపొమ్మని యాజ్ఞాపించెను. ఈతంత్రమును దుష్టపండితు లెల్లరుఁ బన్నిరి. నేను బోయివచ్చెద. నే నెక్కడ నున్నను ప్రీతిమాత్రము మఱువకుము" అని కనుల నీరునించుచు కౌఁగిలించుకొని † విలాసవతి మోమున ముద్దిడియెను.

విలాసవతి యతిఖిన్నయై "ప్రాణప్రియా! నాసుఖము నందును దుఃఖమునందును సగపాలు గైకొను నీకన్న నాకుఁ

† కాళిదాసునకుఁ గాంచనమాలయే కాక విలాసవతి యను నొక యుంపుడుకత్తెగూడఁ గలదు.



ప్రియ మగుపదార్థ మెయ్యది? నిన్ను వదలి సూర్యుని ఛాయాదేవివలె నే నుండఁ జాల. దిగంతవిశ్రాంత మగుకీర్తికాంతను గైసేసి విద్యాభిమానమున వెలయు భోజరాజునకు ద్వితీయసరస్వతివగు నిన్నిట్లవమానించుట కన్న వేఱె యజ్ఞాన మెయ్యది గలదు? ఎట్లైనఁ గానిండు. మీరు దేశాంతరమున కేగ నక్కఱయే లేదు. అన్నివిధముల నేను దనువిషయమై పరిచర్యలఁ జరుపుచుందును. ఇందును గుఱించి యించుక యేనియు సంశయింపక సుఖముగ నాయింటిలో నే నివసింపుఁడు" అని పలుకఁ గాళిదాసు తొలుత సంశయించియుఁ బ్రియావిరహదుఃఖము నాపుకొనఁజాలక యచ్చట నే రహస్యముగ నివసించి యుండెను.

తరువాత భోజుని యంతఃపురమునఁ గాళిదాసుని వెడలఁ గొట్టిన సమాచారమును లీలావతి యెఱింగి భోజునితో నిట్లని యెను. "ఓ దేవా! కాళిదాసు మీకు పరమమిత్రము గదా! అట్టివాని నేల రాజ్యమునుండి వెడలఁ గొట్టితిరి?

"శోకారాతిభయత్రాణం ప్రీతివిస్రంభభాజనం,
కేన రత్న మిదం సృష్టం మిత్ర మి త్యక్షరద్వయం"

'దుఃఖమును శత్రువువలనఁ గలుగుభయమును దీర్చునదియు, ప్రీతివిశ్వాసములకుఁ బాత్రము నగు మిత్రమనెడి యీరెండక్షరము లను రత్నము నెవరు సృజించిరి?'

ఇట్లు లీలావతి పలికినవాక్యముల విని భోజరాజు "ఓ ప్రియురాలా! నాలు గయిదుదినములకు ముందు రాత్రికాలమున నెవరో యీప్రాంతమున 'కాళిదాసు దాసీవేషమును

ధరించి యంతఃపురమున కేగి లీలావతీదేవితో రమించి పోవు
చున్నాఁడు' అని మదనమాలినిని సంబోధించి పలుకుమాటల
నమ్మి నే నిట్లు కపటజ్వరమును బూని తగుప్రకారమున నెల్ల
వృత్తాంతమును గనుఁగొంటిని. కాళిదాసు నాప్రశ్నకనుచితము
గఁ జెప్పినసమాధానమునకు నీవు చిఱునవ్వుగూడ నవ్వితివి.
ఇద్దానికి గొప్పదండన చేయఁదగియున్నను నతనివైదుష్యమును
బట్టి దేశమునుండిమాత్రము వెడలఁ గొట్టితిని. నీచాతుర్యము
నకుమెచ్చి యాయపరాధమును మాత్రము సహించితి" నని
చెప్పెను. లీలావతి యతనిమాటల విని పకపక నగి యిట్లని
యెను. "ఓనాథా! ఎంతయు నే ధన్యురాలను గదా! నిరంత
రము మీయందే సత్యమగు ననురాగమున వర్తించు నామనం
బన్యునియం దెట్లు లాసక్తం బగు? ఐనను మీకు నాయం
దనుమానము గలిగి యుండుటకు మాత్రము నామనంబు
మిగులఁ జింతిల్లుచున్నది. కావున నే దురాచారిణి యయినది
యుఁ బతివ్రత నైనదియు మీరు పరీక్షింపవచ్చును గదా!"

ఈలాగున లీలావతి వక్కాణింప భోజరా జంగీకరించి
యొకఘోరమగు సర్పమును బట్టి తెప్పించి యటులనే యగ్నిని
గూడ నొకచోఁ బ్రజ్వలింపఁ జేసెను. లీలావతి దనపాతివ్రత్య
మహిమవలన వీనినుండి యేమియు భయములేక నిర్విచారమున
స్నానమొనర్చి యిష్టదైవతములఁ బ్రార్థించివచ్చి యాకృష్ణసర్ప
మును చేతితో నెత్తెను. అయ్యది లీలావతి పాతివ్రత్యమునకు
భయపడి కఱవఁజాలక చచ్చినదానివలె నూరక యుండెను.



ఇద్దానిఁ గనుంగొని భోజరా జచ్చెరువునొందియు నంతమాత్ర
మున విశ్వసింపక యగ్నిని గూడఁ బ్రవేశింపు మని చెప్పెను.
లీలావతి యగ్నిదేవుని బ్రార్థించుచు మహాజ్వాలలతో మండు
చుండు నగ్నిలోఁ బ్రవేశించెను. అగ్నియు నాసమయంబున
జందనమువోలెఁ జల్లని వాఁడై లీలావతి కేమియు బాధగలు
గఁజేయ లేకపోవుటయు కాక చప్పున ముడిబొగ్గువడి చల్లాఱి
పోయెను.

అపుడు భోజుఁడు లీలావతి పాతివ్రత్యమహిమకు సంత
సించి తనయజ్ఞానమునకుఁ జింతించి "అయ్యో! వ్యర్థముగా
దెలియ నేరక మహావిద్వాంసుఁడును నా రెండవప్రాణ మునఁదగు
కాళిదాసుని రాజ్యమునుండి వెడల గొట్టితిఁ గదా! ఇట్టి
యనాలోచితకార్యము నెవ్వ రేనియుఁ జేయుదురా! నాచాతుర్య
మేమి? నాగాంభీర్యమేమి? నాసమీక్ష్యకారిత్వ మేమి? జలము
వోలె నిర్మలస్వభావముగలిగి చంద్రునివోలె శాంతమూర్తియై
సూర్యునివోలెఁ దేజస్వియై ప్రజ్వరిల్లుచుండు కాళిదాసుఁడను
యమూల్యరత్నమును బోఁగొట్టుకొను మూఢుఁడు గలఁడా?
చంద్రుఁడులేని రాత్రివోలె నాసభ కాళిదాసులేమి నిఁక నేమి
శోభించును?" అనియిట్లు గాళిదాసునే తలంచుచుఁ జిత్తము
వ్యాకులముకాఁగాఁ గాళిదాసుని మరల రప్పించునుపాయము
నాలోచించుచు నుల్లాసమునకై దనప్రియురాలితోడం గూడి
చంద్రశాలపై కేగి యాశరద్రాత్రియందు నటు నిటు మెల్లన
దిరుగుచుండెను. చంద్రుఁడు తనస్వచ్ఛము లగు కిరణములచే
బ్రహ్మాండము నంతయు వెన్నముద్దవలె దెల్లగఁ జేయుచుండుతఱి

చంద్రబింబమును లీలావతీముఖమును రెంటింగనుంగొనియిట్లు పలికెను.

"తులణాఅణు అణుసరఇ గ్లా ముహచందస్స సో క్ష ఏదావ"

"చంద్రుఁడీమెముఖచంద్రునితో నిశ్చయముగా సామ్య మును బొందుచున్నాఁడు."

మఱునాఁడు భోజరాజు సభాభవనమునకే తెంచి బాణ భవభూత్యాదికవులనుజూచి యీసమస్యను బూర్తిసేయవలయు ననియు నట్లు చేయకున్న నా దేశములో నుండగూడ దనియు నాజ్ఞాపించెను.

ఆసమస్యను విని కవిలోకమంతయు నత్యంతాశ్చర్యము నొంది తమతమయిండ్ల కేగి యనేకవిధముల నాలోచన మొన ర్చిరి; గాని యొక్కని కేనియు నెద్దియు స్ఫురింపక పోయెను. తరువాత బండితులెల్లరుఁ దద్దయు భయభ్రాంతులై యేమియుఁ దోఁపక బాణునితో "ఓపండితరత్నమా! భోజరాజు సభ కేగి ఈసమస్యను బూర్తిసేయ నెనిమిదిదినములుమాత్రము గడు వీయవలయునని మాప్రార్థనగాఁజెప్పుము" అని ప్రార్థించిరి.

బాణుఁడు వల్లెయనిభోజునిసభ కేతెంచి "రాజా! పండితు లెల్లరు సమస్యాపూరణమునకై యిఁక నెనిమిదినములు గడువు గోరుచున్నా"రని విన్నవింప నట్లే కానిండని యాజ్ఞ నొసంగె. "యెనిమిది దినములలోఁ బూరణము సేయ కున్నఁ దొమ్మిదవ దినమున వెఱువాతనే యన్యదేశమున కేగఁదగును"అని ఖండి తముగఁ జెప్పెను.





తరువాత బాణకవి యీవృత్తాంతమునుగవుల కెఱింగిం చెను. ఎనిమిది దినములు గడచినవి. సమస్యాపూర్తి గాలేదు. ఇఁక నేమి చేయవలయును? పండితులెల్లరు నొకచోఁజేరి వల సపోవ నిశ్చయించుకొని దుఃఖాక్రాంతులై యుండఁగా బాణకవి పండితులతో నిట్లనియెను. "పండితోత్తములారా! యౌవనగ ర్వమునను, రాజసమ్మానమదమునను, స్వల్పవిద్యామదమునను గాళిదాసుఁడు నిష్కాసితుఁ డయ్యెగదా! ఇట్టివిషమస్థానములం దతఁ డొక్కఁడే కవి యన నొప్పును. కాళిదాసే యున్నచో మన కందఱికిట్టిగతి యేల పట్టును? దుర్బుద్ధిచేఁ దెలియక కాళి దాసుని వెడలఁగొట్టినందుకు ఫల మనుభవింపక తప్పునా? వేయేల! సామాన్యుఁ డగుబ్రాహ్మణునితోఁగలహమునకుఁబూని ననే వంశనాశము గలుగునందురు! ఇఁక సరస్వతి స్వరూపుఁ డగువానితో విరోధించినచోఁ గవికులమునకునాశనముసంభ వింపకుండునా?" అని సక్రోధంబుగఁ బలికినఁ బండితు లెల్లరు కోపించి యొకరికొకరువాదులాడదొడంగిరి. వారిలోమయూ రకవి యాకలకలమును నివారించి యందఱితో నిట్లనియెను. "ఓకవులారా! వ్యర్థమునఁ గలహముతోఁ బ్రయోజన మేమి గలదు? భోజరాజు మన కొసంగిన యవధి పూర్ణమైనది; గాని సమస్యపూర్ణము గాలేదు

"సంగ్రామేషు భటేంద్రాణాం కవీనాం కవిమండలే,
దీప్తిర్వా దీప్తిహానిర్వా ముహూర్తే నైవ జాయతే."

"భటులకు యుద్ధమునందును, గవులకుఁ గవిగోష్ఠుల యందును గీర్తిగాని యపకీర్తిగాని క్షణకాలములోఁగలుగును."

"కావున నెల్లరకు నిష్టమేని యర్ధరాత్రముననే లేచి యెల్లసంభారములఁ గైకొని యన్యదేశపుమార్గము బట్టుట యెంతయు శ్రేయస్కరము. కాదేని రేపుదయమునఁ దప్పక గళహస్తికాప్రయోగముతో భోజరాజు భటులచే వెడలఁ గొట్టించక మానఁడు. ఇది సత్యము" అని చెప్పఁగనే యందఱొప్పుకొని యర్ధరాత్రమునఁ దమసామానుల నన్నింటి బండ్లమీఁద నెక్కించుకొని యొక్కపెట్టబయలు దేఱిపోవుచుండిరి.

ఆరాత్రియందుఁ గాళిదాసువిలాసవతిక్రీడోద్యానమున విహరించుచుఁ బండితులమాటలు విని జాలినొంది వేశ్యాచేటిని బిలిచి "ఓసీ! ఎవరో మార్గమునఁ బోవుచున్నారు. చూడుము. బ్రాహ్మణులవలె నున్నారు" అని దానిం బంపెను. ఆచేటి రహస్యముగ నేగి వారివృత్తాంతమును గనుంగొని కాళిదాసుకడ కేతెంచి ఓమహానుభావా!

"ఏకేన రాజహంసేన యా శోభా సరసోఽభవత్,
స సా బకసహస్రేణ పరిత స్తీరవాసినా."

"ఒక రాజహంసచేత సరస్సున కెట్టిశోభ గలుగునో యట్టిశోభ వేయికొంగలు చుట్టును గట్టుపైఁ దిరియున్నను గలుగదు గదా!"

"బాణమయూరప్రముఖు లగు కవు లెల్లరు నేలకో పలాయనము చిత్తగించినారు" అని చెప్పెను.

కాళిదాసు ససంభ్రమమున "సుందరీ! వస్త్రములఁ దెమ్ము. శీఘ్రముగ నేగి పలాయమాను లగు కవుల రక్షించెదనుగాక. లోక



మునఁ బరోపకారపరాయణు లగువారి జీవితమే సుజీవితము. బాధితు లగువారిఁ గాపాడని పౌరుష మేటిపౌరుషము? యాచకుల కుపయోగింపనిధన మేటి ధనము? హితము గాని కార్య మేటికార్యము? సత్పురుషులకు విరోధ మగుజీవన మేటి జీవనము?" అని పలికి చారణవేషమును ధరించి ఖడ్గధారియై యొకక్రోసుదూరము పండితులకన్న ముం దేగి మరలి వారి కభిముఖముగ నేతెంచి 'జయ జయ' యని యాశీర్వచనము లొనర్చి "ఓవిద్యాసాగరులారా! బృహస్పతులవలె భోజసభలో వెలుగొందుపండితు లెల్లరు గలసి యెచ్చటికో యేగుచున్నారు. మీ కెల్లరకుఁ గుశలమే కద! రాజు కుశలి యేనా? నేను కాశీదేశమునుండి ధనాశచే భోజరాజదర్శనము చేయవచ్చుచున్నాఁడను" అని పలికెను.

పండితు లెల్లరుఁ బరిహాసము చేయుచు నతనివాక్యమును లెక్కసేయక పోవుచుండిరి. వారిలో నొకపండితుఁడు మాత్ర మతనిఁ జారణునిగాఁ దెలిసికొని సంతసించి యిట్లనియెను. "ఓయిచారణా! మావృత్తాంతమును మే మిప్పుడు చెప్పకున్నను దరువాత నేనియు విందువు. కావున నిప్పుడే చెప్పెద వినుము. భోజరాజీకవుల కెల్లర కొక సమస్యను బూరింపమనియిచ్చెను. వీరందఱు దానిం బూరణసేయం జాలమి భోజరాజుచే భయపడి దేశాంతరమున కేగుచున్నారు."

ఆమాటలు విని చారణుఁ డాసమస్య యేమనియడిగెను. ఆపండితుఁడు పూర్వోక్తమగుసమస్యను జెప్పెను. అదివిని చార

ణుఁడు నవ్వి “ఇదియేనా? చక్కఁగానే చెప్పఁబడి యున్నది. ఈసమస్య పూర్ణేందుమండలమును గనుఁగొని రాజు వక్కాణించెను. కావున దీనికి నుత్తరార్థ మిట్లుండఁ దగును.

“అణుఇది బణ్ణయది కహం అణుకిది తస్స ప్పడిపడిచందస్స?”

అని చెప్పఁగ నందఱు నత్యాశ్చర్యము నొంది యతనిఁ బ్రాణదాతఁగ భావించి యెంతయు సత్కరించిరి. పిదపఁ జారణుఁడు పండితుల కెల్ల నమస్కరించి యథేచ్ఛం జనియెను. అంతఁ బండితులు మరల ధారానగరాభిముఖులై “అద్దిరా! ఇవుడు మనకు బ్రత్యక్షమయిన మనుష్యాకృతి సాక్షాత్సరస్వతియై యుండనోపు” అని యచ్చెరువందుచు నేరికిఁ దెలియకుండఁ బోయినమార్గముననే మరలి తమగృహములఁ జేరి యెల్లరు బ్రాతఃకాలమున భోజరాజసభాస్థానము కేగి రాజునకు నాశీర్వాద మొనర్చి యుచితాసనములఁ గూర్చుండిరి.

తరువాత బాణకవి లేచి “మహాప్రభూ! దేవరవారి యభిప్రాయము నీశ్వరుఁడే యెఱుఁగునో యెఱుఁగఁడో? ఇఁక గుక్షింభరుల మగుమాబోంట్లెఱుఁగుదురనువిషయము కైముతికన్యాయసిద్ధమే కదా! ఐనను దేవరయానతి నతిక్రమింప నొల్లక తోఁచినరీతి విన్నవించుకొను చున్నాఁడను.

“తులణా అణు అణుసర ఇ గ్లా ముహచందస్స సోక్ఖ ఏదాఏ
అణుఇది బణ్ణయది కహం అణుకిది తస్స ప్పడిపడి చందస్స,
తులనా మన్వనుసరతి గ్లా ర్ముఖచంద్రస్య స ఖ త్వేతస్యాః
అన్వితి వర్ణ్యతే కథమనుకృతి స్తస్య ప్రతిపది చంద్రస్య.”



“చంద్రుఁ డీమె ముఖచంద్రునితో నిశ్చయముగా సామ్యమును బొందుచున్నాఁడు. నిశ్చయముగా నని వర్ణింపఁబడినది గాని పాడ్యమినాఁటి ముఖచంద్రున కీమెముఖచంద్రునితో సామ్య మెట్లు కలుగును*”

భోజరా జాసమస్యాపూర్తిని విని “కాళిదాసు పూట ప్రయాణములోఁ జేరఁదగినస్థలములోనున్నాఁ” డనియూహించి యతని నెట్లేని యుపాయముచే రప్పింపఁ దగు నని బాణునకుఁ బదునైదులక్షలరూప్యములు బహుమతినొసంగెను. ఇతర పండితులుసంతోషించినవారివోలెఁ దమతమగృహముల కేగిరి.

బహుమానితధనము నంతయు బాణుఁ డొక్కఁడే తీసుకొనినందులకుఁ బండితులెల్లరు సహింపక ‘ఆ! బాణకవి మిక్కిలి యనుచిత మొనర్చెను. మనవలె వీఁడును నగరమునుండి బయలుదేరినవాఁడే కదా! ఈసమస్యను వీఁడు పూర్తిసేసిన దేమున్నది? ఇచ్చినధనమంతయుఁ దానే తీసికొనెను. కావున నీవృత్తాంతమును భోజున కెఱింగించి యితని నవమానము సేయుదము గాక” అని యాలోచించి భోజునికడ కేతెంచిరి. వీరి ప్రార్థనమును విని భోజుఁడు “పండితులారా! ఈవృత్తాంతమును నేనప్పుడే గ్రహించితిని. మీరు జరిగినసమాచారము నంతయు నిజముగ వచింపుఁడు” అని యడుగఁగా నిశ్చయవృత్తాంతము నంతయుఁ దెలిపిరి. కాళిదాసుఁ డవశ్య మీపట్టణమునఁ జారణవేషమున సంచరించుచున్నాఁడని తలఁచి సకలపరివార

---

ముఖము సదాపూర్ణమండలసదృశము. ప్రతిపత్తునఁ జంద్రున కొక్కకలయే యగుటవలన సామ్యములేదనుట.

సమేతుఁడై పండితులతోడం గూడి పూర్వము చారణుఁడు కనఁబడినస్థలమున కేతెంచెను అచటఁ గాలిజాడ గనఁబడుచుండఁగా దానిని జక్కఁగ నెఱుఁగువారిని గనుఁగొన నాదేశించి ప్రతిపండితునకు నొక్కొకలక్షరూప్యముల నొసఁగి వీడ్కొలిపెను.

తరువాత నాయడుగులు వట్టువారు నంతటఁ దిరుగుచు వానిఁ గనుఁగొనఁజాలక యేమియుఁ దోఁపక యుండిరి. అవుడొకచింపిచెప్పును గైకొని మాదిగవానియింటి కేగు నొకదానినిఁ గాంచిరి. ఆదాసి యాచెప్పును మాదిగవానిచేతి కిచ్చెను. అపుడు భోజుభటులు సంతసించి యామాదిగవానివలనఁడక్కఁగా నాచెప్పును గైకొని దుమ్ముపై వైచిరి. తా మిదివఱకుఁ జూచిన చెప్పుజాడ కించుకయేని భేదము లేక యుండెను. ఇదియే వానియడుగని నిశ్చయించి యద్దాసి వెళ్లినజాడను బట్టి వేశ్యాగృహముజేరి చుట్టు ముట్టడి వేసి వెంటనే యానవాలు దెలిసినదనువార్తను భోజరాజునకుఁ దెలియపఱిచిరి.

తరువాత భోజరాజు మంత్రులతోఁ గూడి పాదచారియై విలాసవతీగృహమున కేతెంచెను. కాళిదాసీవృత్తాంతమెఱింగి "సుందరీ! నావలనఁ గదా నీకిట్టికష్టము సంప్రాప్తించెను" అని చింతిల్లెను. విలాసవతి "ఓ కవిచంద్రా! సుఖసమయమున నందఱు మిత్రులుగనే యుందురు. ఆపత్సమయముననే మనుజులస్నేహము పరీక్షింపఁబడునుగాని గాలివిసరకున్నదూదిరాశికిని బర్వతమునకును భేదమేమియు తెలియదుగదా! బంగారు



వన్నె నొఱగంటిఱాయియందుఁ గనుఁగొనునట్లు బంధువులు, జ్ఞాతులు, మిత్రులు, స్వబుద్ధి, ధనము వీనిసారము నాపదలు సంభవించినప్పుడే కనుఁగొననగును. మనుష్యునకుఁ దాఁగోరక యేదుఃఖము లెట్లు వచ్చుచుండునో యట్లే సుఖములును వచ్చుచుండును. దుఃఖములు సంభవించునపుడుమాత్రము దిగులొందుట భేదము. కావున రాజు నిన్నేమాత్రము నిరాకరించినను దాసీజనముతోడ నాప్రాణముల నగ్నిసాత్కృతములఁ జేయుదును" అని పలికెను.

"ఓప్రియురాలా! అట్లు పలుకకుము. భోజుఁడు నన్నుఁ గనుఁగొనిన నెంతయు సంతసించి నాపాదములమీఁదఁ బడక మానఁడు, చూడుము" అని చెప్పెను.

వెంటనే భోజుఁడు విలాసవతీగృహమును బ్రవేశించి కాళిదాసుఁ గనుఁగొని సాష్టాంగముగఁ బ్రణతుఁడై కౌఁగిలించుకొని యిట్లనియెను.

"గచ్ఛత స్తిష్ఠతో వాఽపి జాగ్రత స్స్వపతోఽపి వా,
మాభూ న్మనః కదాచి న్మే త్వయా విరహితం కవే."

"ఓకవీ! నేనునడచునపుడును, మేల్కనియుండునపుడును, నిద్రించునపుడును నామనము నీవిరహము నొందకుండును గాత."

తరువాత భోజరాజు విలాసవతిం జూచి "ఓవిలాసవతీ! నీవు గదా ధన్యురాలవు. మనోహర మగుపక్షిని పంజరమునందుఁ బోలె నీగుణబంధమువలనఁ గాళిదాసుని బంధించి

వైచితివి" అనికొనియాడి యానందబాష్పపూర్ణుఁడై కాళిదాసుని దనయశ్వముపై నెక్కించుకొని సపరివారుఁడై నిజసౌధమున కేగెను.

---

# 19

# అంకులాడి.

---

భోజరా జొకనాఁడు మాఱువేషమున ధారానగరమున సంచరించుచు నొకబ్రాహ్మణగృహమునఁ గాకియఱపు విని భయపడి వృద్ధుఁడగుతనభర్తను దటాలునఁ గౌఁగిలించుకొనినయొక సుందరిని గనుంగొని యింతమాత్రమున భయపడు నీయువతి తనభర్తను మోసపుచ్చు కృత్రిమపతివ్రత యనియు,నిది రాత్రికాలమున గొప్పసాహసకృత్యముఁ జేయుఁ గావున దీనిం గని పెట్టవలయు ననియు నాలోచించి సాయంకాలమువఱ కచ్చటచ్చటఁ దిరుగుచుండి యస్తమయము కాఁగానే, యొక్కచో రహస్యస్థలమున నుండి చూచుచుండెను.

ఆసుందరి గృహకృత్యముల నన్నిటిఁ దీర్చుకొని భర్తను నిద్రఁ బుచ్చి యతనికి దెలియకుండ మెల్లగ గృహమునకుఁ గవాటబంధ మొనర్చి యిల్లు బయలు వెడలెను.

భోజరా జది గనుఁగొని దాని కెఱుకపడకుండ మెల్లఁగ వెంబడిఁ జనుచుండ నాయువతి నర్మదానదీతీరమునకుఁ జేరెను.



ఆనదియందు మిగుల భయంకరము లగుమొసళ్లు తన వైపునకు రాకుండ కొన్నిమాంసఖండముల వానిముందు వైచి యుపాయమున నావలి దరిఁ జేరి యచటఁ గాచియుండుచాకలవానితో సంపర్కించి తనయిష్టార్థమును నెఱవేర్చుకొని పూర్వరీతిగనే నదీగ్రాహములకు మాంసఖండములు వైచి నదిందాఁటి గృహమునకుఁ జేరెను.

ఇది యంతయుఁ గనుఁగొని భోజుఁ డత్యాశ్చర్యము నొంది యంతఃపురముఁ జేరి నిద్రించి మఱునాఁ డుదయమున సభాభవనమున సకల పరివారములు గొలిచియుండ కాళిదాసభవభూత్యాదిసుకవిజనపరివృతుఁడై కొలువుదీరి కాళిదాసుతో నిట్లనియె.

"దివా కాకరుతా ద్భీతా"
"పగలు కాకియఱపునకు బెదరెను."

కాళిదాసు అతనిసమస్యను విని సాక్షాత్సరస్వత్యవతారమగుటం జేసి యెల్లవృత్తాంతము నెఱింగి యిట్లు ప్రత్యుత్తర మిచ్చెను.

"రాత్రౌ తరతి నర్మదామ్"
"రాత్రియందు నర్మదానదిని దాఁటును."

ఈసమాధానమును విని రాజ త్యాశ్చర్యము నొంది మరల నిట్లు వచించెను.

"తత్ర సంతి జలే గ్రాహాః"
"ఆనర్మదానదీజలమునందు మొసళ్లున్నవి గదా?"

అది విని కాళిదా సిట్లు ప్రత్యుత్తర మిచ్చెను.

"మర్మజ్ఞా సైవ సుందరీ"

"ఆసుందరి మర్మము నెఱింగినదే"

భోజుఁడు కాళిదాసునద్భుతశక్తిఁ గనుఁగొని యెంతయు నచ్చెరువంది కాళిదాసుని మిక్కిలి కొనియాడి భర్తృద్రోహి యగు నాయువతిని రహస్యముగఁ బిలిపించి యుక్తదండనము విధించెను.

---

# 20

# కాళిదాసు-భవభూతి.

ఒకనాఁడు భోజరాజు సకలపరివారసమేతుఁడై నిండుపేరోలగంబుననుండుతఱిఁ గాశీపట్టణమునుండిమహావిద్వాంసుఁడగుభవభూతి యనుమహాకవి యేతెంచెను. అతనిముఖ తేజోవైలక్షణ్యమును బట్టి కవిసత్తముఁ డని యెఱింగి భోజరా జెదురేగి నమస్కరించి తోడ్కొనివచ్చి యుచితాసనమునం గూర్చుండఁ బెట్టెను.

భవభూతియు రాజునకు మంగళాశాసన మొనర్చి సభయంతయు నిశ్శబ్దమై భవభూతివాగమృత మెట్లు ప్రసరించునో చూత మని తదేకాగ్రచిత్తులై యుండిరి. ఆసమయమున భవభూతి లేచి యిట్లు పఠించెను.

ఓ మహాప్రభూ!



"నానీయన్తే మధుని మధుపాః పారిజాత ప్రసూనైః
నాభ్యర్థ్యన్తే తుహినరుచినాచంద్రికాయాం చకోరాః,
అస్మద్వాణీ మధురిమధురాం ప్రాప్య పూర్వావతారాః
సోల్లాసాస్స్యుస్స్వయమిహ బుధాః కింముధాఽభ్యర్థనాభిః."

"పారిజాతకుసుమములు 'మాదగ్గఱ మకరందము గలదు వచ్చి త్రాగుఁడు' అని తుమ్మెదలను పీఁట వేసి పేరంటము పిలుచుట లేదు. తుమ్మెదలు తమంతటఁ దా మేతెంచి తేనె నానుచున్నవి. చంద్రుఁడు 'రండు రండు నావెన్నెలను బానముఁ జేయుఁడు' అని చకోరములను బ్రార్థించుట లేదు. అవియుఁ దమంతనే చంద్రికం గ్రోలుచున్నవి. అట్లే పండితులు మా మధురవాగతిశయము నెఱింగి తమంతటఁ దామే పైఁబైఁబడి 'ఒకపద్దెము చెప్పుఁడు చెప్పుఁడు' అని గట్టిగఁ బ్రార్థింతురు. వారిదగ్గఱ మేము ప్రార్థింప నేల?"

"నాస్మాకం శిబికా న కాపి కటకాద్యాలంక్రియాసత్క్రియా
నోత్తుఙ్గ స్తురగో న కశ్చి దనుగో నైవామ్బరం సున్దరం,
కింతు క్ష్మాతలవర్త్యశేషవిదుషాం సాహిత్యవిద్యాజుషాం
చేతస్తోషకరీ శిరోనతికరీ విద్యాఽనవద్యాఽస్తి నః."

"మాకు సవారి లేదు. మురుగులు మున్నగునలంకారములు సత్కారములు లేవు. పెద్దగుఱ్ఱము లేదు. ఒక్కఁడేనియు భటుఁడు లేఁడు. మంచివస్త్రముగూడ లేదు. ఐనను లోకములోనిపండితుల నెల్లర సంతోషపెట్టి వారిచే నమస్కారములఁ గైకొను ననవద్యమగు విద్యమాత్ర మొక్కటిగలదు."

ఈలాగున స్వోత్కర్షను సభాసదులెల్లరు వినవెల్లడింపఁ బండితపుత్త్రుఁ డగుబాణకవి లేచి "ఆ! నీయాడంబరము చాలు నిలుపుము. మఱి యేసభయం దేని యీయాతిశయోక్తులు సాగునేమోకాని యీభోజసభయం దెన్నటికి సాగనని నమ్ముము. ఊరక యహంకరించిన లాభ మేమి గలదు?

"నిశ్వాసోఽపి న నిర్యాతి బాణే హృదయవర్తిని,
కిం పునః ప్రకటాటోపపదబంధా సరస్వతీ."

"బాణుఁడు (కవి—బాణము) మనమున (ఱొమ్ములో) నాటియుండి నంతదనుక నూపిరి సయితము బయలు వెడలదు. మిగుల నాడంబరమున (శ్లోక) పాదముల (యడుగుల) కట్టుబాటుగల సరస్వతి (వాక్కు—సరస్వతి) యెట్లు వచ్చును?"
అని గంభీరధ్వని మీఱఁ బలికెను.

భవభూతి సభామధ్యమునఁ దన్ని ట్లవమానించినందుల కెంతయు సహింపక యిట్లు వచించెను.

"హఠా దాకృష్టానాం కతిపయపదానాం రచయితా
జనః స్పర్ధాళు శ్చే దహహ! కవినా వశ్యవచసా,
భవే దద్య శ్వో వా కి మిహ బహునా పాపిని కలౌ
ఘటానాం నిర్మాతు స్త్రిభువనవిధాతు శ్చ కలహః."

"అక్కడినుండి యొకపద మిక్కడి నుండి యొకపద మీడిచి తెచ్చి వెత్తికవనము నల్లు మనుజుఁడుగూడ వశ్యవాక్కులు గలవిద్వత్కవితోఁ బోటికిఁ బోయినచో నిఁక వేయుమాటలేల ఆహా! ఈకలిహాతక కాలంబున నేఁడో ఱేపో కుండలఁ జేయుకుమ్మరికిని మూఁడులోకముల నిర్మించిన బ్రహ్మదేవునకును గలహముగావచ్చును."



"ఇంతియ కాక కాళిదాసు కవితసైతము నాకవితతో సామ్యము నొంద పదపదమున నెంతయో భీతిలుచుండును. ఇఁక మీకవితలా నాకవితకు సాటి" అని పలుకఁ గాళిదాసు విని "మిత్రమా! భవభూతీ! నిన్నుగుఱించి పెక్కులు వచింప నేల? నీవు మహాకవివి. ఇది మహాపండితమండిత మగుభోజరాజాస్థానముగదా! ఇచట సాక్షాత్పరమేశ్వరస్వరూపుఁ డగు భోజరాజు మన యిద్దఱి కవితాతారతమ్యమును గనుఁగొనుఁగాక" అనిపలికెను.

భోజరాజు విని సంతసించి "కవిసత్తములారా! మీ రుభయులు సంభోగాంతము వర్ణింపుఁడు" అనియెను. భవభూతి యిట్లు వర్ణించెను.

"ముక్తాభూషణ మిందుబింబ మజని వ్యాకీర్ణతారం నభః
స్మారం చాప మపేతచాపల మభూ దిందీవరే ముద్రితే,
వ్యాలీనం కలకంఠమన్దరణితం మన్దానిలై ర్మన్దితం
నిష్పన్దస్తబకా చ చంపకలతా సా భూ న్న జానే తతః."

"ప్రియురాలిముఖము స్వేదబిందువులచే నొప్పారి యొకానొక నూతనశోభఁ గలిగించుచున్నది. కంఠహారము లన్నియుఁ దెగి యుండలి ముత్తెములు నడుముపైఁ బడి వ్యాపించినవి. బొమముడిపాటు జంకెనలు పోయినవి. కన్నులు మూఁతవడినవి. (సంభోగమధ్యమునఁ గలుగు) మణితధ్వనులు బొత్తిగా నిలిచి

నవి. నిశ్శ్వాసవాతము మందమైనది. స్తనములయుబ్బులాటము తీఱినది. అటుపై నిదశ యవాఙ్మానసగోచరము" తరువాతఁ గాళిదాసు వర్ణించెను.

> "స్విన్నం మణ్డలమైన్దవం విలులితం స్రగ్భారనద్ధం తమః
> ప్రాగేవ ప్రథమానకైతకశిఖాలీలాయితం సుస్మితం,
> శాన్తం కుణ్డలతాండవం కువలయద్వన్ద్వం తిరోమీలితం
> నీతం విద్రుమ సీత్కృతం సహితతో జానే కి మాసీదితి."

"చక్కనిమోము చెమర్చినది. పూలసరములచే నిండిన వేనలి వీడిపోయినది. చక్కని చిఱునగవు మొగలిపూవుకొనవలె నయినది. మొగలిరేకు లేఁతలో మిక్కిలి తెల్లనై ముదిరినకొలఁదిఁ జుట్టును ఓరను మొదటఁగొంచెమును అటుపిమ్మటమఱికొంతయుఁ బిదప మఱికొంతయు నిట్లు క్రమక్రమముగఁ దెలుపంతయుఁదగ్గిపోయి పిదప రేకుయొక్క మొదటమాత్రమించుకధావళ్యము మిగిలి యుండి తుద కదియుఁ బోవునట్లు చిఱునగవుయొక్క ధాళధళ్యము మొదటఁ గొంతదూరము ప్రసరించి పిమ్మట నంతదూరము పోక యంతకన్నఁ గొంచెము కొంచెము క్రమక్రమముగఁ దగ్గి చివరకుఁ బెదవియందుమాత్రము నిలిచి యవల నందుఁ గూడ నదృశ్యమై పోయిన దనుట. కుండలముల యుద్ధతనాట్యము (ఉద్ధతనాట్య మనినందునఁ బురుషాయితము సూచితము) తగ్గినది. నేత్రముః లద్దముగా మూఁత బడినవి. ప్రియుఁడు మాటిమాటికిఁ బెదవిని జుడుక్కునఁ గొఱుకుటచే నయిన నొప్పివలనం గలుగు సీత్కార ముపశమించినది. పిదప నేమిజరిగెనో తెలియదు."



ఈ కవిద్వయవర్ణితశ్లోకములను విని భోజరాజు కాళిదాసుతో నిట్లనియెను.

భోజ:—కవీంద్రా! భవభూతితో నీకు సామ్యముఁ జెప్పఁదగదు.

భవభూతి:—రాజేంద్రా! ఏల నట్లనెదవు.

భోజరాజు:—నీవు సర్వప్రకారములఁ గవి యగుదువు.

బాణుఁడు:—రాజా! భవభూతియే కవి యేని కాళిదాసు నేఁకఁ జెప్పవలయునా?.

భోజ:—బాణకవీ! కాళిదాసుఁడు కవియే కాదు. భూమియందుఁ బురుషాకృతి నవతరించిన సరస్వతియే.

భవభూతి:—దేవా! ఆతనియం దట్టిప్రాశస్త్యమేమి?

భోజ:—భవభూతీ! ఆతనిప్రాశస్త్య మే మని వచింతును? తన శ్లోకమున 'కైతకశిఖాలీలాయితం సుస్మితం' అని పఠించెను గదా! ఇట్టి శృంగారరహస్యము నెవ రెఱుఁగుదురు?

భవభూతి:—రాజా! కాళిదాసుపైఁ బక్షపాతమున నట్లు వచించుచున్నాఁడవు.

కాళిదాసు:—రాజేంద్రా! ఈయపఖ్యాతి యేల? భువనేశ్వరీదేవాలయముగలదుగదా! ఆ దేవిముందఱ రెండుశ్లోకములఁ ద్రాసున నిడి పరీక్షింపుఁడు.

తరువాత భోజరాజు సకలకవిబృందములు వెంటరా భువనేశ్వరీ దేవాలయమున కేగి దేవిసన్నిధియందు భవభూతిచేత నొక త్రాసు నొసంగి సమానపత్రద్వయముపై కాళిదాసభవభూతుల

శ్లోకద్వయమును వ్రాయించి తులపై నుంచెను. పిదప భవభూతి శ్లోకముంచినవైపు పైకి లేచిపోవుచుండ భక్తపరాధీనురాలగు దేవి పండితసభలో భవభూతి కవమానము రాకుండుఁగాక యని నిజకర్ణావతంస కల్హారమకరందమును వామహస్తాంగుళి నఖాగ్రంబునం జిలికెను.

అయ్యది గనుఁగొని కాళిదా సత్యంతానందకందళిత మానసేందీవరుఁడై యిట్లు పఠించెను.

"అహో! మే సౌభాగ్యం మమ చ భవభూతే శ్చ భణితిం
ఘటాయా మారోప్య ప్రతిఫలతి తస్యాం లఘిమని,
గిరాం దేవీ సద్యః శ్రుతికలితకల్హారకలికా
మధూళీ మాధుర్యం క్షిపతి పరిపూర్త్యై భగవతీ."

"ఆహా! ఏమి నాయదృష్టము? నాకవనమును భవభూతికవనమును త్రాసునందుఁ బెట్టఁగా భవభూతికవనమున రసపరిపూర్తి లేకుండుటచేఁ దేలికయై త్రాసు పైకిలేచి పోవ భవభూతికి సభలో నవమానముగలుగు నని భక్తపరాధీన యగు సరస్వతి దనచెవియందు విలాసముగ ధరించిన యెఱ్ఱగలువయందలి మకరందమును రసపరిపూర్తికై చిలుకుచున్నది."

తరువాత భవభూతివినయవినమ్రుఁడై కాళిదాసుని పాదములపైఁ బడి నమస్కరించెను. భోజరాజు మిగులవిశేషజ్ఞుఁడు గదా యని యాశ్చర్యము నొందెను. తరువాత భోజరాజు భవభూతి ననేకవిధముల సత్కరించి నూరుమత్తగజములనొసంగి వీడ్కొలిపెను.

---

# 21

# ఛాందసులు.

---

ఒకనాఁడు కొందఱు స్వాధ్యాయపరులగు ఛాందసులు భోజరాజు కవిత్వప్రియుఁడనియు,దమ వేదాధ్యయనమునకుఁదగినలాభ మలవడలేదనియుఁ, జింతించి యెట్టులేనియు మనమందఱము గవిత్వ మొనర్చి భోజరాజును మెప్పింతమని భువనేశ్వరీదేవాలయముం బ్రవేశించి యొకమూలఁ గూర్చుండి యాలోచించి యాలోచించి జందెము ప్రోవులు వ్రేళ్లకుఁ జుట్టుకొని క్రిందుమీఁదుఁ బడి యెట్టకేల కొకశ్లోకము నొకపండితమ్మన్యుఁడు పఠించెను.

"భోజనం దేహి రాజేన్ద్ర!"
"రాజా! అన్నముఁ బెట్టుము."

మఱియొకఁ డట్లే యతిప్రయాసపడి రెండవచరణముఁ బఠించెను.

"ఘృతసూపసమన్వితమ్."
"నెయ్యి, పప్పు వీనితోఁ గూడినదానిని"

తరువాత నెంతయాలోచించినను ఉత్తరార్థమున్ఫురింపకుండెను.

ఆదివసమునఁ గాళిదాసుఁడు దేవీదర్శనమునకై దేవతాగారమునకేతెంచెను. ఈబ్రాహ్మణులందఱు అదిగాదని యొకఁడు నిది గాదని యొకఁడు నిట్లొక్కపదము నేనియుఁ గూర్పఁ

జాలక నానావస్థలఁ బడుచుఁ గాళిదాసునిఁజూచి నమస్కరించి "అయ్యా! మేము ఘనాంతము వేదముఁ బఠించినను రాజు మీకుఁబోలె మా కేమియు నొసంగఁడు. కవులకు యథేష్టముగ నర్థమునొసంగును. కావున మే మందఱముఁ గవిత్వముఁ జేయవలయు నని బహుకాల మాలోచించి శ్లోకపూర్వార్థమును మాత్రము రచించితిమి. ఉత్తరార్థము స్ఫురింపకున్నది. అద్దాని రచియించి యిచ్చెద వేని మా కేమైన రాజొసంగును" అని ప్రార్థించి తాము రచించినపూర్వార్థమును బఠించిరి. కాళిదాసు విని లోన నవ్వుకొని

"మాహిషం చ శరచ్చన్ద్రచన్ద్రికాధవళం దధి."

అని చెప్పి పోయెను.

అనంతర మాఛాందసులు రాజభవనద్వారమున కేగి "ఓదౌవారికులారా! మేము కవిత్వ మొనర్చుకొనివచ్చినారము గాన రాజదర్శనముఁ జేయింపుఁడు" అని ప్రార్థించిరి. వారు వీరి వేషముఁ గనుఁగొని నవ్వుచు రాజసన్నిధి కేగి యిట్లు విన్నవించిరి.

"రాజమాషనిభై ర్దన్తైః కటివిన్యస్తపాణయః,
ద్వారి తిష్ఠన్తి రాజేన్ద్ర ఛాన్దసాః శ్లోకశత్రవః."

"రాజేంద్రా! అలచందలువంటిదంతములుగలిగి నడుమునందుఁ జేతులుంచుకొని శ్లోకశత్రువులగు ఛాందసబ్రాహ్మణులు ద్వారమునందు నిలిచియున్నారు."

పిదప భోజరాజాజ్ఞచే సభాభవనముఁ బ్రవేశించిరాజున కాశీర్వాద మొనర్చి యందఱొక్కపరి నిట్లు పఠించిరి.



"భోజనం దేహి రాజేన్ద్ర! ఘృతసూపసమన్వితం,
మాహిషం చ శరచ్చన్ద్రచన్ద్రికాధవళం దధి"

"ఓరాజేంద్రా! నెయ్యిపప్పులతోఁ గూడి యున్నభోజనమును, (పప్పన్నము) శరత్కాలపువెన్నెలవలెఁ దెల్లనిగేదెపెరుఁగుతో బెట్టింపుము."

భోజరా జాశ్లోకమును విని పక్కనవ్వి యుత్తరార్థము కాళిదాసకృత మని యెఱింగి యాబ్రాహ్మణులఁ జూచి యిట్లనియెను. "ఓకవివిప్రులారా! ఈశ్లోకపూర్వార్థము రచించినవాని నోటఁ గవిత్వమే రాదు. కావునఁ బూర్వార్థమున కేమియు నొసగఁబడదు. ఉత్తరార్థమునకుమాత్ర మొకకొంతయీయఁబడును" అని పలికి యుత్తరార్థమునకుఁ బ్రత్యక్షరలక్ష నొసంగెను.

వారు దక్షిణను గ్రహించి వెడలిపోఁగా రాజు కాళిదాసుఁ గనుఁగొని "కవీంద్రా! ఆయుత్తరార్థమును నీవే కదా రచించితివి? అని యడిగెను. కాళిదాసు వచించెను.

"అధరస్య మధురిమాణం కుచకాఠిన్యం దృశోశ్చ తైక్ష్ణ్యం చ,
కవితాయాః పరిపాకం హ్యనుభవరసికో విజానాతి."

"పెదవి తియ్యఁదనమును, గబ్బిగుబ్బల గట్టితనమును, చూపులవాఁడిమియు, కవిత్వ పరిపాకమును ననుభవముచే రసము నెఱింగినవాఁడే గ్రహించును" అనిపలికిన కాళిదాసువాక్యములువిని భోజరాజు కాళిదాసు నెంతయు గౌరవించెను.

---

చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1924.

# ఆంధ్రగ్రంథములు.

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| యజుర్వేదకథాసంగ్రహము | .... | 0 | 8 |
| ఆంధ్రవచనభాగవతము, ద్వాదశస్కంధములు, శ్రీ శతఘంటము. వేంకటరంగశాస్త్రికృతము | | 7 | 0 |
| సంగ్రహరామాయణము, శ్రీ. శేషాద్రిశర్మకృతము | | 0 | 10 |
| సంస్కృతనాటకకథలు, శ్రీసీతారామశాస్త్రికృతము | | 1 | 4 |
| దశకుమారచరిత్రము, ఎనముచింతల.సంజీవరాయశాస్త్రిది | | 1 | 8 |
| శివాజీచరిత్ర | .... | 0 | 8 |
| శ్రీరామానుజాచార్యచరిత్ర | .... | 0 | 2 |
| శ్రీశంకరాచార్యచరిత్ర, ప్రతిమతో | .... | 0 | 3 |
| రామకృష్ణపరమహంసచరిత్ర ,, | .... | 0 | 3 |
| బాలగంగాధరతిలకుగారిచరిత్ర ,, | .... | 0 | 4 |
| దాదాభాయినౌరోజీచరిత్ర ,, | .... | 0 | 2 |
| శ్రీకరంచంద్ గాంధిజీవితము ,, | .... | 0 | 4 |
| శ్రీగైక్వారుగారిజీవితము ,, | .... | 0 | 2 |
| శ్రీలాలాలాజ్పతిరాయిజీవితము | .... | 0 | 2 |
| శ్రీగోపాలకృష్ణగోఖ్లేజీవితము | .... | 0 | 2 |
| ఆనిబిసెంటుచరిత్ర, ప్రతిమతో | .... | 0 | 4 |
| వివేకానందస్వామిజీవితము,, | .... | 0 | 2 |
| శ్రీకృష్ణదేవరాయచరిత్ర ,, | .... | 0 | 3 |
| స్వామిరామతీర్థజీవితము | .... | 0 | 2 |
| శాలివాహనచరిత్ర | .... | 0 | 3 |
| శ్రీబుద్ధచరిత్రము | .... | 0 | 4 |
| సోదరినివేదితజీవితము | .... | 0 | 2 |
| సూరతుకాంగ్రెస్సు ఉపన్యాసములు | .... | 0 | 2 |



| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| శ్రీ[illegible]క్వారుగారి ఉపన్యాసములు | .... | 0 | 2 |
| [illegible]నుపూర్వకథలు, శ్రీసీతారామశాస్త్రికృతము | | 1 | 8 |
| కామధేనువుకథ | .... | 0 | 2 |
| భోజకాళిదాసకథలు | .... | 0 | 12 |
| మైరావణచరిత్ర, చక్కనికూర్పు | .... | 0 | 2 |
| రేచుక్కపగటిచుక్కకథలు ,, | .... | 0 | 3 |
| మర్యాదరామన్నకథలు ,, | .... | 0 | 2 |
| పరమానందశిష్యులకథలు | .... | 0 | 3 |
| తెనాలిరామలింగనికథలు, జీవితము | .... | 0 | 4 |
| తాతాచార్యులకథలు | .... | 0 | 6 |
| నలుగురిమంత్రులకథలు | .... | 0 | 4 |
| అయిదుగురుదొంగలకథలు | .... | 0 | 6 |
| సత్యసేనవిజయము, శ్రీ కో. అనంతాచార్యకృతము | | 0 | 4 |
| ఈసబునీతికథలు, క్రొత్తకూర్పు, 1-వ భాగము | | 0 | 6 |
| డిటో 2-వ భాగము | | 0 | 8 |
| షేక్స్పియర్ నాటకకథలు, సులభశైలి | .... | 1 | 8 |
| అరేబియన్ నైట్సుకథలు, చక్కనికూర్పు | .... | 1 | 4 |
| శ్రీగురుజాడ. శ్రీరామమూర్తిగారి ఆంధ్రకవిజీవితములు | | 3 | 8 |
| తారాభాయి, చక్కనినవల | .... | 0 | 12 |
| ఆనందమఠ, నవల, నూతనముద్రితము | .... | 0 | 12 |
| డిటో కాలికోబైండు | .... | 1 | 0 |
| కపాలకుండల, నవల | .... | 0 | 14 |
| దుర్గేశనందని ,, | .... | 0 | 8 |
| ఐవన్హో ,, క్రొత్తకూర్పు | .... | 0 | 8 |
| లాలాబాయి ,, | .... | 0 | 8 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| వీరబాల నవల | .... | 0 | 8 |
| కాశీనారి | .... | 0 | 12 |
| మదాలస ,, | .... | 0 | 10 |
| సుజనరంజని ,, | .... | 0 | 8 |
| మనోహరి, టి. యస్. రామశాస్త్రిగారిది | .... | 0 | 14 |
| టిప్పుసుల్తాన్, నూతనకవితాశైలిని అక్కిరాజు. ఉమాకాంతముగారిచే విరచితము | | 1 | 4 |
| సీతారామము, తల్లాప్రగడ. సూర్యనారాయణరావు | | 1 | 4 |
| రాజర్షి, శ్రీరవీంద్రనాథఠాకూర్ బంగాళీనవలకు తెనుఁగు | | 0 | 14 |
| నీతిచంద్రిక, చిన్నయసూరిగారిది | .... | 0 | 8 |
| పంచతంత్రము, వచనము, సులభశైలి | .... | 0 | 8 |
| క్షేత్రయపదములు, చక్కనికూర్పు | .... | 0 | 14 |
| నీలగిరిపాటలు, శ్రీగురుజాడ. అప్పారాయకృతము | | 0 | 6 |
| అధ్యాత్మరామాయణకీర్తనలు, చక్కనిప్రతి, చిన్నసైజు | | 0 | 10 |
| రామదాసుచరిత్ర, చక్కనికూర్పు, మంచికాగితములు, ఇందు శ్రీరామదాసుగారి ప్రతిమగూడ కలదు | | 0 | 12 |
| విచారసాగరము, శ్రీజనార్దనచైతన్యకృతము | .... | 6 | 0 |
| విచారచంద్రోదయము ,, | .... | 0 | 10 |
| వాసుదేవమననము, వచనము, మంచిఅచ్చు | .... | 0 | 10 |
| వెంకయ్యవ్యాకరణము | .... | 0 | 4 |
| ఆంధ్రశబ్దచింతామణి, సటీక | .... | 0 | 8 |
| బాలవ్యాకరణము, చిన్నయసూరిగారిది | .... | 0 | 12 |
| ప్రౌఢవ్యాకరణము, శ్రీసీతారామాచార్యకృతము | | 0 | 12 |

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292. ఎస్ప్లనేడ్. చెన్నపురి. ఈ.

